# నా దేశం




కర్త

పి. రామచంద్రకాశ్యప బి. ఎ., బి. యల్.,





ప్రచురణ

కళాపీఠము - బెజవాడ.

బాపట్ల జాతీయ కళామందిర్ వారి కానుక




[రు. 2-0-0

# స మ ర్ప ణ ము



పూ జ్యు ల గు

నా పి తృ దే వు లు

యో గా నం దు ల కు

# తొలిపలుకు

'సాహిత్యాంతే నాటకం' అన్నారు పెద్దలు. సాహిత్య సౌధంలో చివరి మెట్టు నాటకం. ఏఖండకావ్యమో, ప్రబంధమో, నవలో వాటిని, సులభముగా ప్రజల ఆదరణను మెప్పునూ, సంగ్రహించవచ్చునేమోగాని, నాటకమువాటిని చీవాట్లు తినకుండా బయటపడడం చాల కష్టము.

ఇతర కావ్యాలలో కవికి, పాఠకునకు ఒక అవినాభావ సంబంధము వున్నది. కవి తనకు కలిగిన భావాలను కావ్యరూపంలో చిత్రిస్తాడు. ఆ కావ్యం, సరాసరి చెక్కు చెదరకుండా పాఠకుని చేతిలోకి వస్తుంది. నాటకం విషయంలో ఈ నీతి వర్తించదు. నాటకకర్తకూ ఆ నాటకం అనుభవించేవానికీ మధ్య "ప్రదర్శనం" అడ్డంవస్తుంది. ప్రదర్శనా దృష్టిలేక కవితా ప్రౌఢిమను వెల్లడించే నాటకాలు 'నాటకాలు' అనిపించుకో జాలవు. నాటకంయొక్క నిజమైన విలువ దాని ప్రదర్శనంవల్లనే బయట పడుతుంది. అటువంటి ప్రదర్శనం సరియైన వాతావరణంలో జరగాలి. దానికి సమర్థులైన నటీనటులుండాలి. నాటకం చదివేవానికి చూచేవానికి నాటకకర్తహృదయం లోని భావాలు అవగాహనం చేసుకునే నేర్పు వుండాలి.

తన హృదయంలోని భావాలను సరిగా అర్థంచేసుకునే నేర్పు అందరికీ వుండదనే బెర్నార్డుషా తన ప్రతినాటకానికీ ముందు చాంతాడంత పీఠికవ్రాసి ఆ నాటకాలకొక విశిష్టతను కలుగచేశాడు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఆపీఠికలే లేకపోతే బహుశా ఆ నాటకాలు కూడా కాలగర్భంలో కలిసిపోయేవేమో!!

మన తెలుగు సాహిత్యంలో నాటకకళకు సరియైన స్థానంగాని, ప్రోత్సాహంగాని లేదు. ఏ దేశపు సాహిత్యం తీసుకున్నా అందులో ప్రథమస్థానం నాటకకర్తకే చెందుతోంది. షేక్స్పియర్, ఇబ్సన్, కాళిదాసు, మొలియర్ ఇలాంటి ప్రపంచ విఖ్యాత నాటకకర్తలు మన తెలుగు సాహిత్యంలో వుద్భవింపలేదు. నాటకకళకు సంఘం సరియైన ప్రోత్సాహం ఇవ్వక పోవడమే యీ జీర్ణావస్థకు కారణమై యుండవచ్చు. నిన్న మొన్నటి వరకూ మనసాహిత్యంలో చెప్పుకోదగ్గ నాటకమే లేదు. కిందటి శతాబ్దం

చివరదశలో శ్రీ ధర్మవరం కృష్ణమాచార్యులుగారు కొన్ని నాటకములను రచియించి వాటిని తమ ఆధ్వర్యం క్రిందనే ప్రదర్శిస్తూ వుండేవారు. కాని ఆ నాటకాలు కఠిన పదభూయిష్టమై సామాన్యజనులకు అర్థంకాకుండా వుండేవి. ఏరసాన్నైనా ప్రత్యేకంగా చూపరుల హృదయంలో నాటవలసి వచ్చినపుడు పద్యాలు ఆధారంగా తీసుకోబడుతూ వుండేవి. అప్పటినుంచీ, నాటకంలో పద్యానికొక ప్రత్యేక స్థానం ఏర్పడింది. ఆరోజుల్లో శ్రీయుతులు ధర్మవరం కృష్ణమాచార్యులు, వేదం వెంకటరాయశాస్త్రి మొదలైన సంస్కృత ఆంధ్రసాహిత్యంలో ప్రత్యేక కృషి చేసిన పండితులే నాటకరచనకు పూనుకొన్నారు. వారుపూర్తిగా సాహిత్య దృష్టితోనే నాటకాలను రచియించినారేగాని ప్రదర్శనా దృష్టితో గాదు. సంభాషణలకు ఏ విధమైన ప్రాముఖ్యము కూడ ఆ నాటకముల యందు కన్పడదు. ఆనాటక ప్రదర్శనముల యొక్క ఫలితము వాటి యందుండు పద్యములు వల్లించు విధముపై ఆధారపడి యుండెడిది. అందుచేత ప్రదర్శనములను చూడబోవు వారు ప్రత్యేకముగా ఆ నాటకములయందుండు పద్యములను తాము అభిమానించు నటకులు పాడినప్పుడు వినగోరి పోయెడివారు. రానురాను నాటకములకు పద్యము 'ప్రాణవాయు' వైనది. నాటకములో ఎన్ని పద్యములున్న అది ప్రదర్శించుటకు అంత వీలుండెడిది. నటకులు కూడ వారికి పద్యము పాడగలశక్తిని బట్టియే వారినటనా సామర్థ్యము నిర్ణయింప బడెడిది. మొదటిరోజులలో పద్య భావమునకు దానిలోని మాటల పొందికకూ ఒక విలువవుండెడిది. రానురాను పద్య భావమునకు ప్రాధాన్యము నశించి రాగప్రాధాన్యము హెచ్చినది. ఎప్పుడైతే భావప్రాధాన్యము నశించినదో ఆనాడు భాషాసంపర్కము లేని వాడైననూ తాను పాడుచున్న పద్యములోని భావమును ఈషణ్మాత్రమైనను గ్రహించలేని వాడైననూ తనగాన మాధుర్యముచే ప్రేక్షకులను ఆకర్షింప గలుగుటయేగాక నటనా విశిష్టత అతనిలో 'నిండుకున్న' దైననూ నటకాగ్రేసరుడని పేరుబడుట అలవాటైపోయినది అందుచేత రానురాను ప్రదర్శనాదృష్టి నశించుటయే గాక సాహిత్యదృష్టి కూడ నశించి పోయినది. అప్పటినుండి నాలుగు పద్యములు ఏరి కూర్చగలిగిన ప్రతివాడు నాటకరచయిత అయినాడు.

ప్రజలలో సరియయిన విజ్ఞానము లేక పోవుటచేత వారిని ఏవిధముగా పోసపుచ్చిననూ చెల్లిపోయినది. దానివలన మన తెలుగు నాడులో నాటక

కళకు నాటక సాహిత్యమునకు పురోభివృద్ధి లేక క్షీణదశ వాటిల్లినది. ఇట్టి పతితస్థితినుండి నాటక కళను ఉద్ధరించుట నేటి కళాకారుల ముఖ్యకర్తవ్యమై యున్నది.

మనకున్న ఉత్సాహముతో ఏ నూత్నపథాన్ని త్రొక్కినను, మనకు వెనుకనుంచి, వెక్కిరింపులూ, వేళాకోళాలు తప్పవు, అది ఆంధ్రజాతికే ఒక నైజమయినది. దానివలన మనము భయపడవలసిన పనిలేదు. భయపడకూడదు కూడాను. సంస్కృతి కలవారు, నాటకకళయందు అభిరుచి కలవారు ముందడుగు వేయక తప్పదు. మన ప్రయత్నములు సంపూర్ణ సఫలీకృతములు కాకపోవచ్చు. కాని నాటకకళ పునరుజ్జీవనములో మన కృషిని ఇతరులు గుర్తింపక తప్పదు. అందుచేత నాటకరచనలో నాకు ఏవిధమైన పూర్వానుభవము లేకపోయినను, నాటక రచనలోని సాధకబాధకాలు పూర్తిగా గ్రహించిన వాడనయ్యూ ఇప్పటి నాటకరచనలలోను, ప్రదర్శనముల లోను నాకుగల నైరాశ్యభావమే, నన్నీ గురుతర బాధ్యతను స్వీకరింపజేసినది.

నాటక రచనకన్న హేయాతి హేయమైన స్థితిలోనున్నది ప్రదర్శనము. నేటి నాటక ప్రదర్శనమునకు గానము ఆయువుపట్టు అయియున్నది. అందుచే నటనకు ప్రాధాన్యము నశించి, దాని అవసరమే లేదు గ్రహింపబడుటలేదు. పాత్రకు తగిన నటుడు నేడు అవసరములేదు. ఉచ్చారణతో నిమిత్తములేదు. భావ భేదములనుబట్టి గొంతుస్థాయి మార్పు(Modulation) అవసరమని చాలమంది నటులకు తెలియనే తెలియదు. తీయని గొంతువున్నా, దానితో అన్ని లోటుపాట్లు తుడుచుకొని పోతాయి, నటుల విషయమే ఇంత అధ్వాన్నముగా నున్న, నటీమణుల విషయం వేరే చెప్పనవసరం లేదు. భాష, భావములు రెంటితోను వారికి సంబంధంలేదు. 'పాత్రపోషణ' అనిన వారికేమిటో తెలియనే తెలియదు. ఎటువంటి పాత్రయైనను, 'లింగు, రంగా' యని సింగారించుకొని నాలుగు చిందులువేసి, నాలుగు అర్థంలేని భావాలతో. అవగాహనంగాని రాగాలతో, తాళ జ్ఞానంతో నిమిత్తం లేకుండా, హార్మోనిష్టు లాగినంతవరకూసాగి పాడే, ఈ నటీమణుల గాన మాధుర్యాన్ని వర్ణించడానికి ఆ బ్రహ్మకైనా తరంగాదు. ఏమాత్రం విజ్ఞానంలేని యిలాంటి నటీమణులతో నటించడం ఎంతకష్టమో చదువరులే గ్రహించుకొనవచ్చును.

కిరాయి తీసుకొని నటించడంలో ఏమాత్రం తప్పు లేదేమో కూడా! అమెచ్యూరుగా వుండి కళకు నిజమైన సేవచేయడం కష్టం. నాటక కళను జీవనోపాధిగా పెట్టుకున్నవాడు దానికి తన సర్వశక్తులూ వినియోగించుకో గలుగుతాడు. కాని ఏ కళ అయిననూ, ప్రజలను సన్మార్గమునకు కొంపోవు నదియే నిజమైన కళ కాగలదు. అట్టి సన్మార్గమునకు కొంపోవు నాటకములు, నాటక సమాజములు వర్ధిల్లాలి.

చారిత్రాత్మకమైన నాటకంగాని, పౌరాణికమైన నాటకంగాని వ్రాయడం కంటె సాంఘిక నాటకం వ్రాయడం కష్టమని నా అభిప్రాయము. పౌరాణికంలోను, చారిత్రాత్మకంలోను నాటక కర్త అనుభవించే స్వేచ్ఛ సాంఘికంలో దొరుకదు. "మనం రోజూ చూచేదానిని గురించి వ్రాయడం ఏమంత కష్టం" అనే అభిప్రాయం కొందరిలో లేకపోలేదు. కాని చూడగలిగినదంతా ప్రతివాడూ వ్రాయగలిగితే అందరూ ఈపాటికి కవులూ, నాటకకర్తలూ అయ్యేవారు. మన బాహ్యేంద్రియాలే కాకుండా, మన మనస్సుకూడా చూడకల్గే శక్తి వుండాలి. చూడటమే కాకుండా ఆ అనుభవాన్ని యితరులకు అందజేసినప్పుడే కవి అనిపించుకో గలుగుతాడు.

ఈ నాటకం సాంఘికమే గాకుండా, ప్రస్తుత రాజకీయంతో కూడు కొని యుండుటచేత దీనిని నిష్పక్షపాత దృష్టితో చూడటం చాలాకష్టం. రచయిత తన ప్రత్యేక అభిప్రాయాలను ప్రజలలో ప్రచారంచేయుటకు ఈ నాటకం వ్రాయబడియుండలేదు. హిందూదేశ చరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖింపవలసిన 1942 అగస్టు ఉద్యమాన్ని ఆధారంగా తీసుకొని దానిపై ఒక నాటకాన్ని సృష్టించవలె నను ఉత్సాహమే ఈ రచనకు కారణం. ఈ నాటకంలో వెల్లడించిన యుద్దేశ్యములతో రచయితకు ఎట్టిసంబంధమూ లేదు. 1942 అగస్టులో 'క్విట్' కొన్న వివిధ దృక్పథములను నిరూపించుటయే నా సంకల్పము. కాన ప్రేక్షకులు, చదువరులు, అదృష్టితోనే ఈ నాటకాన్ని స్వీకరిస్తారని ఆశిస్తున్నాను.

విమర్శకుల కొక్కమాట: "లోకో భిన్న రుచిః" అన్నారు. అందరినీ సంతృప్తిపరచుట ఆ పరమేశ్వరుని తరముగాదు. సహృదయముతో ఇచ్చిన విమర్శలన్నియూ కృతజ్ఞతతో స్వీకరింతును. నిర్మాణాత్మకమైన విమర్శ చేయగలవారు బహు అరుదు. ఇప్పటి విమర్శకులలో చాలమంది "అభ్యుద-

యము, అభ్యుదయము" అని అనచేవారేగాని, అభ్యుదయకర సంస్థలను గాని, రచనలను గాని గుర్తించే స్థితిలో వీరు లేరు. నాటకప్రదర్శనములో - నటీనటుల లేమి రంగపరికరముల కొరత అందులో అమెచ్యూరు సంస్థకు సరియైన ఆదరణ లేకపోవుట, ఈ సాధక బాధకములను విమర్శకులు గుర్తించాలి.

ఇది నా ప్రథమ ప్రయత్నం. అందులో రాజకీయ వాతావరణంలో కూడుకొన్న సాంఘికం. అందుచేత ఈ తొలిప్రయత్నం మీకు అన్నివిధాలా సంతృప్తిని ఇవ్వకపోవచ్చు. కాని నాటకకళయందు నాకున్న ఉత్సాహాన్ని గుర్తించి మీఆదరాభిమానాలు నాకు ఎల్లప్పుడూ వుంటాయని ఆశిస్తున్నాను.

ఈ నాటకం ఆంధ్రదేశంలో ప్రచారం పొందిన తర్వాత యిలాంటి జాతీయ నాటకాలు అనేకం వ్రాయబడి ప్రదర్శింపబడుతున్నాయ్. ఇది నాఆశయసిద్ధిగా భావిస్తున్నాను. ఇలాంటి నాటకాలు ఇంకా వ్రాయబడాలి. ప్రేక్షకులలో యిలాంటి నాటకాలయందు ఆసక్తిని కలుగజెయ్యాలి.

ఈ నాటకాన్ని ఆంధ్రప్రేక్షక లోకానికి అందజేసిన "జాతీయ కళామందిర్" వారికి నాకృతజ్ఞతాభివందనములు. నాటకకళను పునరుజ్జీవింపజేయుటకు వారు చేస్తున్నకృషి ప్రశంసనీయము. వారికీ, వారిసంస్థకు ప్రజల ఆదరాభిమానము ఎల్లప్పుడూ వుండుగాక !

రొయ్యూరు (కృష్ణా)
1—6—1947

రామచంద్ర కాశ్యప.

# ఒక మాట.

ఈ నాటకము ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ [1946] నెలలలో కొంత మద్రాసులోనూ, కొంత నా స్వగ్రామమైన రాయుడ్వారులోనూ వ్రాయబడినది. దీని రిహార్సల్సు 1946 మే మాసంలో "ఇండియన్ నేషనల్ థియేటర్, బాపట్ల" వారి ఆఫీసులో జరిగినయి. ఈ నాటకపు ప్రథమ ప్రదర్శనం ది 30-5-1946 తేదీన నిడుబ్రోలులో జరిగినది.

ఆ ప్రదర్శనము జరిగిన కొన్నిరోజులకు "యిండియన్ నేషనల్ థియేటర్" కార్యనిర్వహణలో అభిప్రాయ భేదములు కలిగి, నా మిత్రులు కొందరు దాని నుండి విడిపోయి "జాతీయ కళామందిర్" అను వేరొక సంస్థను స్థాపించుకున్నారు. అప్పటినుండియూ నా నాటకం "జాతీయ కళామందిర్" ఆధ్వర్యాన ప్రదర్శింపబడుతూ వచ్చింది. అప్పుడు ఇండియన్ నేషనల్ థియేటరువారికి ప్రదర్శించుటకు సరియైన నాటకంలేక, నిడుబ్రోలులో "నా దేశం" ప్రదర్శనమునకు ప్రాంప్టర్ గా పనిచేసిన ఒకాయనచే "చలో ఢిల్లీ" అను పేరుతో ఒక నాటకాన్ని తయారుచేయించి మొదటిసారిగా ది 1-7-46 న తెనాలితాలూకా చినపులివరు గ్రామంలో ప్రదర్శించారు. "నా దేశం" "చలోఢిల్లీ" - యీ రెండు నాటకాలూ చూసినవారు రెంటిలోనూ అనేక సామ్యములు చూసి "ఏదిముందూ, ఏది వెనకా" అని మమ్ములను ప్రశ్నించుటచే ఈ ప్రకటన చేయవలసి వచ్చినది. "నా దేశం" ప్రథమ ప్రదర్శనంనాడు "చలోఢిల్లీ" నాటకం కాగితం మీద కాదుగదా, కవి హృదయంలో కూడా లేదన్న విషయాన్ని పాఠకులు గ్రహించాలి. అందుచేత ప్లాటులోనూ, పాత్రలలోనూ, సంభాషణలోనూ "నా దేశం" "చలోఢిల్లీ" - యీ రెండు నాటకాలలోనూ సామ్యం యేమన్నావుంటే దానికి కారకుణ్ణి "నేను కాదు" అన్న విషయాన్ని పాఠకులు గమనించ కోరుతాను.

రామచంద్ర కాశ్యప.

---

# "జాతీయ కళామందిర్"

ఈ సంస్థ 1946 సంవత్సరం జూన్ నెలాఖరున, బాపట్లలో స్థాపింపబడినది. ప్రచార నాటకాలద్వారా స్వాతంత్ర్య పోరాటాన్ని, ఆగష్టు ఉద్యమాన్ని, స్వాతంత్ర్య వీరుల వీర గాథలను, ప్రజలకు అందిజేసి వారిలో స్వాతంత్ర్య పిపాసను కలుగజేయుడమే మా ఆశయం. మన జీవితంలో పాతుకుపోయి, వేరుపురుగుల్లాగా తొలుస్తున్న, సంఘ దురాచారాలనూ, మూఢనమ్మకాలనూ, పెలికితీసి, ప్రజానీకంలో ఒక నూత్న చైతన్యాన్నీ, శోభనూ కలిగించడానికి తోడ్పటమే, మా ఆశయం.

మా ఆశయాలు చాలా గొప్పవైనప్పటికీ, వాటిని నిర్వహించడంలో మేము అనేక అడ్డంకులను లోనుగావలసి వచ్చింది. సరియైన నటీ నటులు లేక, నాటకప్రదర్శనాలను సొంతంగా నిర్వహించడానికి తగినంత మూల ధనం లేక, సరియైన స్టేజి యిక్విప్‌మెంటు లేక, కృష్ణ రాయబారాల తోనూ, తులాభారాలతోనూ సంతృప్తిపడే ప్రేక్షకలోకానికి, ఒక్కసారిగా, ఒక జాతీయనాటకాన్ని అవగాహనంచేసుకునే నేర్పు సిద్ధించకపోవడం చేతనూ, మేము అనేక యిబ్బందులను యెదుర్కొనవలసి వచ్చింది.

మాదిపూర్తిగా ప్రజలఆదరణమీద అధారపడ్డ సంస్థ. ఎంతటికష్టస్థితిలో నైనా యితరులనుండి పూచికపుల్లకూడా యెరుగని సంస్థ మాది. నటీమణులు కాకపోయినా, నటులు మాత్రం, విద్యాధికులే కాకుండా, చిల్లిదమ్మిడీ కూడా ఆశించే వారుకారు. నాటక కళయందు వారికున్న యభిలాష, అభిమానము, సమైక్యతాభావము, స్వాతంత్రేచ్ఛ - యివే "జాతీయ కళా మందిర్" సభ్యత్వమునకు ముఖ్య కారణం. వారిసహకారం లేనిదే యీసంస్థ యింతముందుకు వచ్చేదికాదు.

అనేక సంస్థలు మమ్మలను ఉచిత ప్రదర్శనాలు యిమ్మని కోరుతూ వచ్చాయి. ఈ సంస్థ, ముఖ్యంగా ప్రజానీకంలో, స్వాతంత్ర్య సందేశాన్ని, సంఘ సంస్కారాన్ని లలిత కళలద్వారా ప్రచారం చేయడానికి స్థాపించబడ్డది గనుక, ఉచిత ప్రదర్శనాలు యివ్వడం మాకు సంతోష విషయమే గాకుండా, మా అవసరంకూడానూ! కానీ, ఉచిత ప్రదర్శనాలు కోరే యీ సంస్థలు మాదికూడా ఒక జాతీయసంస్థ యనీ దానికికూడా కొన్ని

తప్పనిసరి ఖర్చులు వుంటాయన్న విషయాన్ని మరిచిపోకూడదు గదా! అందుచేత "మీకు ప్రదర్శనానికయ్యే ఖర్చులుమాత్రం యిస్తాం. ప్రదర్శించి పొండి" అంటే మేము ఒప్పుకోలేని పరిస్థితి యేర్పడుతోంది. మా ఆఫీసు ఖర్చులు, పోస్టల్ ఖర్చులు, ప్రదర్శనాలకు అవసరమైన ఎక్విప్‌మెంటు ఖర్చులు, శాశ్వతనిధి, యివన్నీగాక మా సంస్థ అభ్యున్నతికి అవరోధాలు కల్పించే కుతంత్రులవల్ల కలిగే దండుగ ఖర్చులూ, యివన్నీ మేము యేలా సాధించాలి? అందుచేత మమ్మల్ని ఉచితప్రదర్శనాలు అడిగే ప్రతి వారినీ మాకు ప్రదర్శనానికయ్యే ఖర్చులు కాకుండా మా సంస్థకు కూడా కొంత విరాళం యివ్వాలని కోరుతున్నాం. ఈ విరాళం కోరడంలో మేము కిరాయి నటులం కావాలని కాదు. మా సంస్థ "మఖలో పుట్టి పుబ్బలో మాడకుండా వుండడం" కోసమే!

మేము యీ "నాదేశం" నాటకాన్ని కొన్ని ముఖ్యకేంద్రాలలో ప్రదర్శించాం. కాంగ్రెసు నాయకులు, విమర్శకులు, కవులు, పత్రికా సంపాదకులు, ఫిలిండైరక్టర్లు అనేకమంది యీ నాటకాన్ని చూచారు. వారి అభిప్రాయాలను మేముకోరాం. తెలుసుకున్నాం. వాటిని వీలయినంత వరకూ ఉపయోగించుకున్నాం కూడా! కొన్ని విమర్శలు మాకు ఉపయోగకరంగా పరిణమించినా విమర్శలలో చాలాభాగం ప్రస్తుత నాటక ప్రదర్శనానికిగల అవరోధాల్ని గమనించకుండా ప్రకటించడంవల్ల వాటిని ఆచరణలో పెట్టడానికి మాకు సాధ్యం కావడంలేదు.

"లోకోభిన్నరుచిః" అన్నారు. అందుచేత మేము అందరినీ సంతృప్తి పరచలేక పోవచ్చును. మాకుకూడా ఒక "ఐడియల్ డ్రామా"ను ప్రదర్శించాలని వున్నా మాకు నష్టం రాకుండా బయట పడాలంటే మేము ప్రేక్షకుల అభిరుచులను గమనించాలి. ఒక్కసారిగా గాకుండా, నెమ్మది నెమ్మదిగా వారి దృక్పథాన్ని మార్చడానికి ప్రయత్నం చెయ్యాలి. ప్రజలయొక్క సంస్కృతిని ఆధారం చేసుకునే, నాటక ప్రదర్శనాలు వుంటాయి.

ఇప్పుడు ఆంధ్రదేశంలో అనేక యామెచ్యూర్ సొసైటీలు వున్నాయి. ఇవన్నీకూడా, సంఘీభావం లేకుండా, దేశ అభ్యున్నతికి యిలాంటి సంస్థల ద్వారా ప్రతియువకుడూ తన సర్వస్వమూ ధారపోసి కృషిచేసి ముందడుగు

చేయవలసిన యీ తరుణంలో 'పవర్ పాలిటిక్స్' కుల మత భేదాలతో ఒక అడుగు వెనక్కి వేస్తూ కేవలం నిరాశ్రయుల్లాగా బాధ్యతారహితంగా "ఎవరికివారే యమునాతీరే" అని ప్రజల్ని మరచిపోయి పెద్దపెద్ద వుపన్యాసాలిస్తూ చిందులు తొక్కడం, పరిహాసాస్పదం! వీటినన్నిటినీ కలిపే ఒక సంస్థ వుండటం అవసరం. "యమెచ్యూర్ డ్రమాటిక్ సొసైటీస్ యూనియన్" అనే ఒక సంస్థను ఏర్పరచడం ముఖ్యావసరమని మేము భావిస్తున్నాం. యిప్పటి నాటక కళాపరిషత్ ఆంధ్ర నాటక రంగానికీ, నాటక కళకూ శాశ్వతమైన నిర్మాణాత్మకమైన రేమీ ఒక్క పని చేయ లేదని చెప్పటానికి సాహసిస్తున్నాను. యీ యమెచ్యూర్ సంస్థలకు ఏవిధమైన సహాయంకూడా ఈనాటక కళాపరిషత్ నుండి సిద్ధించడం లేదు. అందుచేత యమెచ్యూర్ సంస్థల పురోభివృద్ధికై, మనంతట మనమే ప్రయత్నించడం ముఖ్యావసరం. ఈ విషయమై రేయమెచ్యూర్ సొసైటీ రైనా నాతో కరస్పాండ్ చేస్తే సంతోషిస్తాను. ఈ మా అభిప్రాయాలు కొంచెం కటువుగా వ్రాయాల్సి వొచ్చిందంటే అది మా తప్పుగాదు. అది ఆంధ్ర నాటక కళను యీ స్థితికి తీసుకొని వచ్చినవారిదే.

ఇహ మా విషయం. జాతీయ పురోభివృద్ధికీ, సంఘ సంస్కరణకూ ఉపయోగించే నాటకాలు వ్రాసిన రచయితలు ఎవరన్నా యుంటే వారి రచనలు మాకు తప్పకుండా పంపవలసిందని కోరుతున్నాం. ఉత్సాహవంతులైన నటీనటులకు మా కళామందిర్ లో స్థానం వుంది. వారు బీద పరిస్థితుల్లో వుంటే మా కళామందిర్ వారిని పోషించడానికి సిద్ధంగా వుంది

తర్వాత, యీ "నాదేశం" నాటకం ప్రస్తుతం, జాతీయకళామందిర్ అధ్వర్యాన ప్రదర్శింపబడుతూ వుంది. ఇప్పటికి మద్రాసు, తెనాలి, గుంటూరు, నంద్యాల, యింకా కొన్నిచోట్ల ప్రదర్శించినాము. మా సంస్థలో యింకా చదువుతున్న వారు, వివిధ వృత్తులలో వున్న వారు; వుండుటవల్ల ప్రేక్షక జనం చూపుతున్న ఆదరాభిమానాలకు తగినట్లుగా వెంట వెంటనే ప్రదర్శనములు యివ్వలేక పోతున్నాం. ఇంకా మా సంస్థకు స్వతంత్రంగా నిలబడే స్థితి రాలేదు గనుక, యీ నాటకాన్ని ప్రదర్శించేవాళ్ళు ప్రస్తుతానికి మా కొక్కరికే వుంచవలసినదని యీ నాటకం రచయిత శ్రీరామచంద్ర కశ్యపగారిని కోరాం. దానికి వారు తమ అంగీకారాన్ని తెల్పారు.

వారికి మా కృతజ్ఞత, మా ప్రదర్శనాన్ని చాలా ఉన్నత స్థితిలో వుంచిన నటీనటకులకు మా కృతజ్ఞత తెలుపవలసి ఉన్నది. మా కళామందిర్ సభ్యులున్నూ, కార్యనిర్వాహణలో నాకు చేదోడు వాదోడుగా వుంటూన్న ప్రతి వ్యక్తీ, ఈ సంస్థ అడుగడుగుకూ ముందుకు సాగడంలో వున్న అడ్డంకులను అధిగమించుటయందు తమ నిత్యజీవితంలో త్యాగం చూపుతూ నాతో సహకరిస్తూ, ఎంతో ఆదరాభిమానముల చూపుతున్నందుకు వారికి నా ధన్యవాదాలు. ఈ గ్రంథ ముద్రణ ప్రచురణయందు మాకు ఎంతో సహకారం చూపిన ప్రఖ్యాత కళాభిమాని, రచయిత శ్రీ తాండవ కృష్ణగారికి మా అభివందనములు. మా ఆశయాలు ఫలించాలంటే ప్రజల పత్రికల సహకారం అవసరం. స్వాతంత్ర్యం మన జన్మహక్కు !!

సెలవు.

బాపట్ల
1—6—1947

వడ్లమూడి సీతారామారావు L. L. B.,
కార్యదర్శి
[redacted] జాతీయ కళామందిర్.

# ప్రార్థన గీతము

జై ! జై ! దేశమాతా !
జై ! జై ! దేశమాతా !
నీ యశశ్చంద్రికల జాతీజ్యోతులా
సర్వ లోకములు వెలుగనీ ॥జై జై॥
భారతనేతా మహాత్మగాంధీ
విశ్వమంతకూ శరణ్యము ॥జై జై॥
సత్యమహింసా విశ్వప్రేమల
స్వరాజ్య సాధన ఆశయమూ
మము దీవింపుము మాతా
దేశమాతా ॥జై జై॥

[ శ్రీ "వాణీ ప్రసాద్" అనుమతితో ]

# "స్వేచ్ఛారుణోదయం"

అదుగో !

స్వేచ్ఛారుణోదయం,

అదుగో !

నలుదిశలా, నవ వసంతమూ

వెదజల్లునదే ॥స్వేచ్ఛా॥

తరము తరములా

దాస్య తిమిరాల

కరుగ జేసి

లోకాల వెలిగించు,నదుగో

స్వేచ్ఛారుణోదయం

అదుగో !!

(విద్యాసాగర్ అనుమతితో)

# నా దేశం

## 1. వ రం గ ము

### రాధా మోహన్ ఇల్లు

[ధనవంతుని యింటిలోని హాలు. ఒక పెద్ద టేబిల్, ఒక సోఫా, రెండు కేన్ కుర్చీలు, ఒక పడక కుర్చీ, ఒక కోటుస్టాండ్ అమర్చబడి వుంటయి. టేబిల్ మీద బిగ్ బెన్ వుంటుంది. భానుమూర్తి ప్రవేశం. ఏబది అయిదేళ్లుంటయి. తలా, మీసాలూ నెరసీ నెరవని స్థితిలో వుంటయి. రావడంతోటే టేబిల్ పైన ఆనాటి ఉదయం పేపరుకోసం వెతుకుతాడు. కనబడదు. యిహా కుర్చీలూ, టీపాయీ అన్నిచోట్లా వెతుకుతాడు. ఎంత వెతికినా పేపరు కనపడక పోయేటప్పటికి విసుగుతో, పెదవి విరచి]

భాను: అప్పడూ! ఒరేయి అప్పడూ!

అప్పడు: [పరిగెత్తుకుంటూ వచ్చి] ఎంటండీ బాబయ్యా ?

భాను: పేపరేదిరా ?

అప్పడు: యింకా రాలేదండి.

భాను: మైలొచ్చి మూడు గంటలయితే యింకా రాలేదే మిటా ?

అప్పడు: యింకా మయిలు రాలేదంటండీ ?

భాను: ఛీ, ఛీ! నిన్నకూడా యింతే! బజారెల్లి కనుక్కున్నావ్?

అప్పడు: ఎల్లానండి.

భాను: ఎంత సేపయింది ?

అప్పడు: యిప్పుడే గదండీ.

భాను: "యింకా పేపరు రా లేదు". అంతేనా?

అప్పడు: అంతేనండి.

భాను: [అప్పణ్ణి వెక్కిరిస్తూ] "అంతేనండి". ఆ జర్మనీ వాడెళ్లి ఆస్ట్రియామీద పడ్డాడుట. వాడిగతేమయిందో నని నేను తహతహ లాడుతుంటే, [దీర్ఘంతీస్తూ] "యింకా మయిలు రా లేదుండి."

అప్పడు: నేనేం సేయునుండి.

భాను: గంగలోదూకు... ఆ నిర్భాగ్యుడేడీ?

అప్పడు: ఓరండీ?

భాను: ఎవరా... మన అబ్బాయిగారు.

అప్పడు: అబ్బాయి గారా అండి.

భాను: ఆ మహాత్ముడే! ఏడీ?

అప్పడు: యింకా పక్కనుంచి లేలేదండి.

భాను: యింకా లేవ లేదూ?

అప్పడు: లేదండి.

భాను: తొమ్మిది గంటలయినా!

అప్పడు: సిత్తమండి.

భాను: రాత్రి యెన్నింటికి వచ్చాడేం?

అప్పడు: మూడవుతుందండి.

భాను: బాగానేవుంది. అప్పడూ! యెట్లారా నేచచ్చేది? నైటు క్లబ్బులూ, డాన్సులతో వీడికి తీరిక లేకపోతే, ఊరేగింపులూ

మీటింగులతో దానికి తీరిక లేకపోయె. ఎట్లాగురావీళ్ళిద్దరి మధ్యా నే బతికేది?

అప్పడు: ఒకసారి గట్టిగా నోరు సేసుకోండి బాబయ్యా!

భాను: నోరు కాదు మట్టి చేసుకోవాలి. ఏమన్నా అంటే "యీ ఆస్తీఅంతా నాది. మా అత్తవారిచ్చారు. మీ ఒద్దీ యేమిటం" టే మనం నోరు మూసుకోవాల్సిందేనా?

అప్పడు: అయితే యీ పాకలేరులు, యిళ్ళూఅన్నీ మనసిన బాబుగారి వేనా?

భాను: హాన్నీ వాడివే.

అప్పడు: అన్నీ!

భాను: అహా! అందులో ఒక్క పూచికపుల్ల మీద కూడా మన కధికారంలేదు.

అప్పడు: అట్టా సెప్పండి బాబయ్యా! అందుకనే మీరంటే సినబాబుగారికి అంతనిర్లచ్చ.

భాను: నిర్లక్ష్యం కాకపోతే యేమిటా (?), పొద్దు నెత్తిమీద కొస్తుంటే యింకా నిద్ర లేవకపోతే యెట్లారా! నాలుగు వేళలా చూచుకుంటేనే కాపరాలు నిలుస్తయి...నిద్ర లేచాడేమో చూడు.

అప్పడు: [సైడువింగులోకి తొంగిచూసి] యింకా లేదండి.

భాను: [కొంచెంసేపు ఆలోచించినట్లు నటించి] ఒరేయి, ఆ గడియారం యిటు తీసుకురా.

[అప్పుడు గడియారం తీసుకొచ్చి భానుమూర్తి కిస్తాడు. భానుమూర్తి అలారం మళ్లు అలారం కొట్టేవరకూ తిప్పుతాడు. అలారం గణగణా మ్రోగుతూ వుంటుంది. అది మ్రోగటం ప్రారంభించగానే భానుమూర్తి అప్పుడూ చకచకా నడుస్తూ వెళ్లిపోతారు]

రాధామో: [తెరలో నుంచి] ఎమిటీగోల ! స్టాపిట్ !

[రాధా మోహన్ ప్రవేశం. 25 ఏండ్ల యువకుడు నైటుడ్రెస్సుతో వుంటాడు. చెరిగిపోయిన క్రాపూ, మూసుకొని పోతున్న కళ్లూ, నిద్ర మత్తుతో రంగంమీద ప్రవేశిస్తాడు. కాళ్లీడ్చుకుంటూ బిగ్ బెన్ దగ్గరకు వచ్చి అలారం ఆపివేస్తాడు. అటూయిటూ చూసి]

అప్పడూ, ఎక్కడ చచ్చావురా!

[టీపాయి ముందున్న సోఫాలో కూచొని సిగిరెట్టు వెలిగించడానికి నిప్పుపెట్టెకోసం జేబులు తడుముకొంటూ వుండగా అప్పడు ప్రవేశం]

అప్పడు: ఎందుకు బాబయ్యా! పిలిసారు.

రాధామో: అప్పుడు పిలిస్తే యిప్పుడా రావటం. పోయి కాఫీ తీసుకురా [అప్పడు వెళ్తుండగా] అరే అప్పడూ, నా గదిలో నిప్పుపెట్టె వుంది గాని తీసుకురా.

అప్పడు: సిత్తంబాబయ్య.

[అని వెళ్ళబోతుండగా రాధా మోహన్ చేతిలోనుండి సిగరెట్టు క్రిందపడుతుంది]

రాధామో: అప్పడూ [అప్పడు ఆగి వెనక్కు తిరుగుతాడు] క్రింద సిగరెట్టు పడ్డది తియ్యి.

[అప్పడు తీసిచ్చి నుంచుంటాడు.]

రాస్కెల్! అలాచూస్తావేమిట్రా! కాఫీ తీసుకురా.

[కాఫీ తీసుకురావడానికి వెళ్తుంటే]

అరే అప్పుడూ నువ్వాయిలారా, నిప్పుపెట్టె తెమ్మంటే తెచ్చావురా? బ్లాక్ హెడెడ్ బూట్సు! వీళ్ళను నరికినా పాపం లేదు.

[అప్పుడు గుడ్లు తేలవేసి రాధా మోహన్ వంక చూస్తుంటాడు]

అలాచూస్తావేంరా? నేనేందయ్యానా! భూతాన్నా! పో, తీసుకురా.

[అని చేతిలోవున్న సిగిరెట్టు అప్పడి ముఖాన కేసి కొడతాడు. అప్పుడు భయంతో నిప్పుపెట్టె తీసుకురావడానికి లోపలికి వెళ్తుంటే]

ఇడియట్! ఆసిగిరెట్టుపెట్టె యిలా యిచ్చి వెళ్ళవోయి.

[అప్పుడు భయంతో సిగిరెటుపెట్టెతీసికొని రాధా మోహన్ కిస్తాడు. అది అందుకొని]

పో! మాచ్ బాక్సు తీసుకురా.

[అప్పుడు నిష్క్రమణ]

ఏపని చెప్పినా తొందరగా చేయడం లేకపోయె. యెందుకిలాంటి సర్వెంట్సు జీతం దండుగ.

[భానుమూర్తి ప్రవేశం]

గుడ్ మార్నింగ్ డాడీ!

భాను: గుడ్ మార్నింగ్!

రాధామో: ఎక్కడ దొరికాడండీ మీకీ సర్వెంటు?

భాను: ఏం? వాడు చాలా మంచివాడేనే!

రాధామో: వట్టి యిడియట్! మాచ్ బాక్సు తీసుకురారా అంటే మూడుగంటలు ఆలస్యం చేస్తాడేం!

భాను: బాగానేవుంది. నీకు చెప్పడం తెలిస్తే వాడికి చేయడం తెలుస్తుంది. వాణ్ణి వూరికే ఖంగారు పెట్టేస్తావ్. మరియిలా వుంటే మన ఫాక్టరీ యెలా మేనేజ్ చేస్తున్నావో నాకర్థం కాకుండావుంది. ఈ కాలంలో పనివాళ్ళకు అతిచాకచక్యంగా చెప్పాలి. చేయించుకోవాలి. రోజులు మారిపోతున్నాయి!

[భానుమూర్తి మాట్లాడుతూ వున్నంతసేపూ రాధా మోహన్ వెలిగించని సిగిరెట్టు పీలుస్తూ వుంటాడు.]

రాధామో: అప్పుడూ! అరే అప్పుడూ!

[భయపడుతూ అప్పడు ప్రవేశం]

మాచ్ బాక్సు యేదిరా?

అప్పడు: కనపడ లేదండీ.

రాధామో: ఫూల్! ప్రతిదీ నీకు కనబడదు. ఆ టేబిల్ మీదంతా వెతికావ్?

అప్పడు: వెతికానండి.

రాధామో: పక్క మీద?

అప్పడు: సిత్తం బాబయ్యా.

రాధామో: అలా నీళ్లు నములుతా వేంరా? చూడరా...నా కోటు జేబులో. ఛో. [అప్పడు నిష్క్రమణ] అబ్బబ్బ! చచ్చి

పోతున్నాను. యింత లేజీ సర్వెంట్సు వుంటేయెలా! లేచి పావు గంటయింది. కాఫీలేదు, యేం లేదు.

[అప్పుడు నిప్పు పెట్టె తెచ్చి యిస్తాడు.]

అమ్మయ్య [అప్పుడు నిష్క్రమణ రాధా మోహన్ సిగరెట్టు వెలిగిస్తూ] కమల యేది ఫాదర్?

భాను: ఎనిమిది గంటలకు ఆడవాళ్ల కాన్ఫరెన్సు వుందిట. అక్కడ కెళ్లింది.

రాధామో: కాన్ఫరెన్సు! కమల బిహేవియర్ నా కేమీ నచ్చటం లేదు.

భాను: నేనూ అదే అనుకుంటున్నాను. మన పలుకుబడికి తగ్గట్టు మనం నడవాలి. "సోషల్ రిఫారమ్, సోషల్ రిఫారమ్" అని మనం అనాకానీ ముండల్తో తిరిగితే యెలా?

రాధామో: అదిగాదు నాన్నగారూ! యెంత రిఫారమ్సు అయితే మట్టుకు మన రోటరీ క్లబ్బులూ, నైటు క్లబ్బులూ చాలవుటండీ. అసలు దానికి మానర్సే తెలియవ్. మొన్న డాక్టరురావు వస్తే యింట్రడ్యూస్ చేసాను. డాక్టరురావుకు చాలా పెద్ద ఆస్తివుందండీ. అట్లాంటి వానితో అది చులకనగా మాట్లాడేసింది. జంటిల్ మన్ అవడంచేత మారు మాటాడకుండా వెళ్లిపోయాడు. భానుమూర్తిగారి పిల్ల బజార్ల వెంట తిరుగుతూ వుందంటే మనకెంత నామర్దోమీరే ఆలోచించండి.

[అప్పుడు కాఫీ తీసుకువచ్చి యిచ్చి వెళ్ళి పోతాడు.]

భాను: నిజంరా నాయనా! నిజం. నేను మొదటి నుంచీ అనుకుంటూనే వున్నా. అది మన యింట్లో పుట్టవలసిన పిల్ల కాదూ అని.

రాధా మో: అయినా దీనికంతటికీ మీరే కారణం.

భా ను: ఇదేమిటి! నామీద నెడుతున్నావ్! బాగానేవుంది. కమల యేమంటూవుందో తెలుసునా?

రాధా మో: ఏ మంటూం దేం?

భా ను: నువ్వు చెడి పోతున్నావనీ, దానికంతటికీ కారణం నేననీ! నువ్వేమయినా, అది చెడిపోతోందనీ, దానికంతటికి కారణం నేననీ. బాగానేవుంది వరుస! మీ యిద్దరిమధ్య పాపాల కల్లా భైరవుణ్ణి నేను దొరికాను.

రాధా మో: నేనేం చెడిపోతున్నాను?

భా ను: ఏంకావాలి? సిగిరెట్లూ డ్రింకులూ వీలయితే డాన్సులూ యివి చాలవూ?

రాధా మో: బాగానేవుం దే! సొసైటీకోసం చేస్తూవుంటే దాంట్లో తప్పేముంది? మనబోటి వాళ్లంతా చేయడంలా? ......అయినా దానికా నెహ్రూస్పీచ్ విన్ననాటి నుంచి మతి తిరిగిందండీ.

భా ను: అవునురా బాబూ! లేకపోతే ఆ ఖద్దరు దుస్తులేమిటి!

రాధా మో: ఆ జాతీయ గీతాలేమిటి!

భా ను: ఆ మీటింగుల్లో మాట్లాడట మేమిటి!

రాధామో: ఆ రోడ్లను దున్నడ మేమిటి!

[కమల ప్రవేశం. 20 ఏళ్లుంటాయి. నిరాడంబరం. నాజూకుగా వుంటుంది. చేతిలో వానిటీబాగ్, పేపరూ]

కమల: [ప్రవేశిస్తూనే] ఏమిటి, నాగురించేనా? యీ ప్రశంస అంతా [యిద్దరు మాట్లాడరు, ఖాళీగావున్న కుర్చీలో కూర్చొని, యిద్దరి వంకా చూసి] ఏం, మాట్లాడ రేం?

భాను: అవును, నీ గురించే. అన్నయ్య యేమంటున్నాడో తెలుసా?

కమల: ఏమంటున్నా డేం?

భాను: నీ పద్ధతి యేమీ బాగుల్లేదట.

కమల: ఎందుకని? ఆయనకు నేనేం అడ్డం వచ్చాను. ఏం, అన్నయ్యగారూ, మాట్లాడ రేం.

రాధామో: కమలా, నీకు చెపితే కోపం వస్తుంది కానీ, మన పొజిషనేమిటి, నువ్వు చేస్తున్న పనేమిటి.

కమల: [వెటకారంగా నవ్వుతూ] మన పొజిషనేమిటేం?

భాను: [కోపంతో] అమ్మాయి! వాడు సీరియస్‌గా మాట్లాడుతూ వుంటే నువ్వలా సమాధానం చెప్తే యెలా?

కమల: [సీరియస్‌గా పోజుపెట్టి] సెలవియ్యండి అన్నయ్యగారూ!

రాధామో: ఓ చెల్లెలుగారూ! నా ఫ్రెండ్సంతా తమ గురించి యే మనుకుంటున్నారో తెలుసా అండి?

కమల: ఓ అన్నయ్యగారూ! మరి నా ఫ్రెండ్సంతా మీగురించి యేమనుకుంటున్నారో తెలుసాఅండి?

రాధామో: ఏదీ సెలవియ్యండి చెల్లెలుగారూ!

కమల: [ఆవేశంతో లేచి] నువ్వు బీదవాళ్ళ రక్తం పీల్చి పిప్పి చేస్తున్నావనీ, నీవంటి వాళ్ళవల్లే యీ పరప్రభుత్వం మన దేశంలో వుండగలిగిందనీ, ఏనాడు నీబోటివాళ్ళు కళ్లు తెరుస్తారో, ఆనాడు యీ తెల్లప్రభుత్వానికి పుట్టగతు లుండవనీ!

భాను: [కోపంతో] కమలా! ఏమిటిది. యిల్లను కున్నావా? పబ్లిక్ ప్లాట్‌ఫారం అనుకున్నావా? వూరికే లెక్చరు దంచేస్తూన్నావ్. అన్నయ్య నీ మంచికోసం చెప్తావుంటే.

కమల: ఏమిటి నామంచి ఆయనకు, ఒక్కసారి ఆయిల్లులోపని చేసేవాళ్ళ నడగండి. ఈయన చేస్తున్న దురాగతాలు తెలిసివస్తయి.

రాధామో: ఓగాడ్! ఓగాడ్! విల్ యూ ప్లీజ్ స్టాపిట్! కందకు లేని దురద కత్తిపీటకట! నాకెందుకు. నీ యిష్టంనీది. నాయిష్టంనాది.

కమల: థాంక్సు! మొదటి నుంచీ అజ్ఞానంవుంటే చాలా బాగుండేది.

[అని కమల లోపల కెళ్తుంది.]

భాను: అహాహా! యింటిలోని పోరు యింతింతగాదయా విశ్వదాభిరామ వినుర వేమ!

[అని బైటకు వెళ్ళిపోతాడు. అప్పుడు ప్రవేశం చీటీతో. చీటీ రాధామోహన్‌ కిస్తాడు.]

రాధామో:[చీటీచదివి విసుగుతో] లోపలికి రమ్మను.

[అప్పుడు నిష్క్రమణ. సూర్యం ప్రవేశం. 22 ఏళ్ళుంటాయి. బీద దుస్తులు.]

సూర్యం: నమస్కారమండీ.

రాధామో: మా ఆఫీసులో ఖాళీ లేంలేవని చెప్పలా. మళ్లీ యెందుకొచ్చావ్?

సూర్యం: ఎక్కడా ఉద్యోగం దొరకలేదండీ.

రాధామో; అయితే నన్నేం చేయమంటావ్.

సూర్యం: మాసంసారమంతా నా మీదే ఆధారం. ఇంట్లో ఒక్క బియ్యపు గింజయినా లేదు.

రాధామో: అదికూడా నాతప్పే!

సూర్యం: నిన్నటినుంచీ పస్తుకూడా! నా మాట నమ్మండి. చాలా కష్టదశలో వున్నాను. మీబోటివారు కరుణించక పోతే యెలా చెప్పండి.

రాధామో: కరుణ! కరుణ కావాలిస్తే చాలామంది వున్నారు. అయినా యెందుకీ అనవసరపు ప్రసంగం. ఖాళీలు లేవన్నాను. లేవు. యిహానీవు వెళ్ళచ్చు.

సూర్యం: పోనీ మీ ఫాక్టరీలో కూలీగానైనా...

రాధామో: యఫ్. యె. దాకా చదివి కూలీపని చేస్తావ్?

సూర్యం: కడుపు కూటికి యేపనయితేనేం.

రాధామో: నువ్వు చాలా అసాధ్యుడుగా వున్నావే. సరే అట్లాయితే ఆలోచిస్తాను.

సూర్యం: ఆలోచించడం గాదు. క్షమించాలి. రేపేపనిలో ప్రవేశిస్తాను.

రాధామో: అయితే నేను గుమాస్తాకు చీటీ వ్రాసిస్తాను. అది తీసుకువెళ్లి చూపించు. నిన్ను పనిలో చేర్చు కుంటాడు.

[అని రాధామోహన్ ఒక చిన్న కాగితము మీద వ్రాసినట్లు నటించి ఆ కాగితము సూర్యానికిస్తాడు.]

సూర్యం: [రాధామోహన్ వ్రాసియిచ్చిన చీటి అందుకొని నమస్కరిస్తూ] మీ మేలు జన్మలో మరువలేను. థాంక్సు!

[అని అంటూవుండగా కమల ప్రవేశం]

కమల: [సూర్యంవంక చూసి] హాల్లో! సూర్యం!

సూర్యం: కమలా! నమస్తే!

రాధామో: యితను నీకు తెలుసాయేమిటి?

కమల: అవును. యింటర్‌లో మేమిద్దరం క్లాసుమేట్సుం, ఏం, సూర్యం! యిప్పుడెక్కడుంటున్నావ్?

సూర్యం: ప్రస్తుతం యీ ఊళ్లోనే.

కమల: యేదో పనిమీద వచ్చినట్టున్నావే? [సూర్యం మాట్లాడడు]

రాధామో: [వెటకారంగా నవ్వుతూ] పాపం. నీకు చెప్పడానికి సిగ్గు పడుతున్నాడు. మన ఫాక్టరీలో కూలీగా పని చేస్తాడట. యిప్పించమని అడగటానికి వచ్చాడు.

కమల: యెందుకన్నయ్యా, అలానవ్వుతావ్? కూలీ చేసుకు

బ్రతికితే తప్పా? నీలాగా సోఫాలమీద కూచొని ఆ బీద ప్రజల రక్త మాంసాలు తోడెయ్యకపోతే, వాళ్లతో పాటు నీవూ కష్టపడి పని చేయరాదూ!

రాధామో: కమలా! అప్పుడే మరచి పోయావ్? [లేచి లోప లకు వెళ్తూ] నీ యిష్టం నీది. నా యిష్టం నాది.

[రాధామోహన్ నిష్క్రమణ]

సూర్యం: ఏం కమలా, యిప్పుడేంచేస్తున్నావ్?

కమల: లా చదువు తున్నాను.

సూర్యం: సరే, యింకేం! మాకో ఆడప్లీడరు వస్తుందన్న మాట.

కమల: మరి నీవో, అన్నట్టు యీ కూలీపని చేయడమేమిటి?

సూర్యం: సంసారం నెత్తిమీద పడ్డ తర్వాత దేనికైనా తల వొగ్గాలి.

కమల: సంసార మంటున్నావ్. పిల్లాజెల్లా యెంతమందేమిటి?

సూర్యం: "అడుక్కు తినడానికి నేను జాలక నాతోపాటు ఒక కోతి"యని యింకా భగవంతుడి దయవల్ల ఆఖర్మకూడా పట్టాలా?

కమల: అయితే యీ కూలీపని దేనికి?

సూర్యం: ఏంచెయ్యం? యింటర్ పరీక్షలముందేగదూ మానాన్న పోయాడు. దాంతో చదువుకు స్వస్తి చెప్పాల్సి వచ్చింది. ఈ రెండు మూడేళ్ళబట్టీ వెధవ ఉద్యోగాలకోసం

తిరుగుతున్నాను. కాళ్ళు కాయలు కాచిపోయినయి. యింటి దగ్గర మా అమ్మ ఒకటే దిగులు.

కమల: నువ్వొక్కడవే నా యేమిటి మీ అమ్మకు?

సూర్యం: నేనూ నా చెల్లెలూ.

కమల: ఏమన్నా చదువుతోందా?

సూర్యం: చదువుగాదు చట్టు బండలు. అయినా చదివి మొగవాళ్ళం మేము ఉద్ధరిస్తున్నాంగా. యింకా ఆడవాళ్లు కూడా దేనికి?

కమల: యీ విసురు నామీాదా యేమిటి? అయితే ఆడవాళ్ళకు చదువు అక్కర్లేదంటావా?

సూర్యం: యీ "డాగ్" "కుక్కా", "కాట్" "పిల్లి" చదువులు ముమ్మాటికీ అనవసరం.

కమల: మరి మగవాళ్ళో?

సూర్యం: వాళ్ళకు కూడా అనవసరమంటాను.

కమల: అయితే ఈ బి. ఏ., యం. ఏ., చదవడం శుద్ధ దండుగంటావ్?

సూర్యం: అమాయకులైన మామల దగ్గర్నుంచి కట్నాలు గుంజడానికి తప్ప! అదయినా పూర్వులిచ్చిన మనోవర్తి యేమన్నా కలిస్తేనే!

కమల: సరె యింకేం బాగానేవుంది. అయితే నీ ఉద్దేశ్యంలో యెలాంటి చదువు వుండాలంటావ్?

సూర్యం: మనిషికి యేదయితే శారీరకశక్తి, మానసికశక్తి యిస్తుందో అలాంటి చదువు వుండాలంటాను.

కమల: హియర్! హియర్! యింకేం! కొద్దిరోజుల్లో నీవూ ఒక గాంధీమహాత్ముడివి అయిపోతా వన్నమాట.

సూర్యం: యిప్పటికీ దేహీయని చేయి జాచటంలో నాకూ ఆయనకూ భేదం లేదు.

కమల: పోనీ ఈభావాలన్నీ పత్రికలకు రాయక పోయినావా?

సూర్యం: యిహ రక్తంలో ముంచిరాయల్సిందే... వెళ్లొస్తాను. కమలా! థాంక్ యూ వెరీమచ్!

కమల: థాంక్స్ దేనికీ?

సూర్యం: నీలోవచ్చిన మార్పుకు.

కమల: యేమి మార్పేం?

సూర్యం: యింటర్‌లో నువ్వు చాలా హైలా పచ్చీసుగావుండే దానవ్. యిప్పుడు నీ భావాలూ నీనడవడీ పూర్తిగా మారిపోయినయి. అందుకు నా థాంక్సు!

కమల: ఓ! అదా.

సూర్యం: ఏనాటికయినా నీలాంటివారే ముందర తమ గృహాల్లో, తర్వాత సంఘంలో, నూత్న చైతన్యాన్ని తీసుకురా గలుగుతారు.

కమల: మనం చదువుకొనే రోజుల్లో నీ ఉపన్యాసాలువిని

నువ్వు పెద్దలీడరు అవుతావని అనుకునే వాళ్ళం. మొత్తానికి ఆజ్యోతి యింకా నీలో వెలుగుతూనే వుందన్నమాట.

సూర్యం: ఆ ఆశాసౌధాలే నన్నీ అభాగ్యస్థితిలోకి తీసుకు వచ్చినయి. వాటిని యెందుకు జ్ఞాపకంచేస్తావ్. వెళ్ళొస్తాను. [అని రెండడుగులు బైటవైపుకు వేస్తాడు.]

కమల: [ఆలోచిస్తున్న దానివలె నిలబడి పోతున్న సూర్యాన్ని తన మాటతో ఆపుతూ] సూర్యం! [సూర్యం నిలబడి వెనక్కి తిరుగుతాడు] ఒక్క క్షణం! [అని లోపలికివెళ్ళి నాలుగు పదిరూపాయిలునోట్లు తీసుకవచ్చి సూర్యం చేతిలో పెట్టబోతుంది.]

సూర్యం: [నిర్ఘాంతతతో చూసి, గద్గదిక స్వరంతో] దేనికివి కమలా!

కమల: ఫరవాలేదు నీ దగ్గరవుంచు.

సూర్యం: క్షమించు, కమలా! యీ డబ్బు నాకవసరం లేదు.

కమల: [ఆశ్చర్యంతో] అదేమిటి సూర్యం! నువ్వు అన్యధా తలిస్తే యెలా? ఆపదలో సాయంచేయని స్నేహితులు దేనికి ?

సూర్యం: యిలాంటి సాయంతో నన్ను యెన్నాళ్లు జీవించ మంటావ్. ఒద్దు కమలా! యిలాంటి పని నేను చేయలేను.

కమల: నువ్వు చాలా కష్టదశలో వున్నట్టున్నావ్. పోనీ, మీ యింటికి బియ్యం పంపిస్తాను, సరేనా !

సూర్యం: కమలా! యెందుకు నన్నిలా బలవంత పెడతావ్ ! యింతకాలం నుంచి యెలా బ్రతుకుతున్నా మనుకున్నావ్? మా నాన్న వదిలిపెట్టిన ప్రావిడెంటు ఫండే మా కాధార

మయింది. అది అయిపోవడం వల్లనే యీనాడు కూలీపని చేయడానికి కూడా సిద్ధపడ్డాను. రేపే పనిలో ప్రవేశిస్తాను. అదిచాలు. మా జీవనాధారానికి వేరేమీ అక్కర్లేదు.

కమల: నిన్ను చూసి మెచ్చుకోవాలో, విచారించాలో నాకు తెలియకుండా వుంది. పోనీ ఒక్క పండయినా?

సూర్యం: [నవ్వుతూ] సరె, నీ యిష్టం!

[కమల లోపలికి వెళ్లి ఒక డజన్ పళ్లు తెచ్చిస్తుంది. సూర్యం ఒకటి తీసుకో బోతాడు]

కమల: నో! నో! అన్నీ తీసుకోవాలి.

సూర్యం: [అన్నీతీసికొని] థాంక్సు... మరి... సెలవు.

[సూర్యం నిష్క్రమణ. కమల అతనివంక అభిమానంతో చూస్తుంది.]

కమల: [పాట]

భారత దేశా భాగ్యము పారం,
భారతీయుల భిక్షవిచారం ॥భా॥
పర దేశీయులదే యధికారం,
జీవితదాస్య మువహారం ॥భా॥
వేదాంతులకే నిర్విచారం
పేదాసాదల బ్రతుకే భారం ॥భా॥
ఆకలి దప్పుల కోర్వ లేని
అల్పజీవులాకే దాధారం,
భారత దేశా భాగ్యమపారం
భారతీయుల భిక్షవిచారం
భారత దేశా !!!

# నా దేశం

## 2. వ ర ం గ ము

### సూ ర్యం యి ల్లు

[ఇంటిలోని ఒకహాలు. వెనుక వాసంతో దణ్ణెం. పక్కగా మంచం. తెరయెత్తేటప్పటికి తల్లి శేషమ్మ చేట ముందుపెట్టుకొని బియ్యంలోని బెరికలు యేరుతూ వుంటుంది. కూతురు శ్యామల రాట్నం వడుకుతూ పాడుకుంటూ వుంటుంది]

శ్యామల:

రా! రావోయి!
భరతమాత పిలుచుచుండె
లే! లేవోయీ.
దాస్య శృంఖలాలు తెగ్గించి ముందుకు పదవోయీ
భరతమాత బాధదీర్ప నీవె దిక్కోయీ
నీ కన్నతల్లి కష్టాలూ కంటితో కనవో ॥రా॥
నీచబ్రతుకు బ్రతికితివని ఖేద మొందెదేలా?
కలకాలము కష్టాలు కాపుర ముండవోయీ
ధైర్యముతో, స్థైర్యముతో
ముందడుగిడవోయీ
పిలచినదే! కదలుముగా.
రా! రావోయీ!

[సూర్యం ప్రవేశం, ఫ్యాక్టరీ దుస్తులు]

అన్నయ్యా, కాయా, పండా?

సూర్యం: పాటమెందుకు ఆపావమ్మా? నీ పాట విని పడ్డ శ్రమంతా మరిచి పోదా మనుకుంటే!

శ్యామల: సర్లె! చెప్పన్నయ్యా, కాయా పండా?

సూర్యం: దేన్నిగురించి నువ్వడిగేది?

శ్యామల: కూలీ హెచ్చుచేయమని అడుగుతా నంటివే?

సూర్యం: ఓ, అదా అడిగాను. పండులాగా కనిపించింది గాని కాయే!

శ్యామల: అంటే?

సూర్యం: తీయనిమాటలు చెప్పాడు. కూలీమట్టుకు అంతే యిచ్చాడు.

[శ్యామల నిరాశతో రాట్నం దగ్గరకు వెళ్తుంది]

ఈ విషయమా నువ్వడిగింది. యింకా నేను గుమాస్తా గారి దగ్గరకు చేబదులు కెళ్ళిన సంగతే మో ననుకున్నాను.

శ్యామల: [మరల సూర్యాన్ని సమీపిస్తూ] ఆ! ఏమయింది? కాయా, పండా ?

సూర్యం: ఏముందీ! కాయా లేదు. పండూ లేదు. అసలు చెట్టే కనిపించలేదు! గుమాస్తాగారు వూళ్ళోలేరుట. [ఒక్క నిట్టూర్పువదలి] కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టమ్మా!

[శ్యామల మంచినీరు తీసుకురావడానికి లోపలికి వెళ్తుంది. సూర్యం బడలికతో ఆప సోపాలుపడుతూ వుంటాడు.]

శేషమ్మ: [కొడుకు అపసోపాలుచూసి]ఒద్దురా నాయనా. ఆతండ్రి పేరు నిలబెట్టరా అంటే విన్నావూ? ఎందుకు చెప్పు, నీకా కూలిపని. ఆయెండలో తిరగడం చూడు! ముఖం యెట్లా వాడిపోయిందో. ఒక్కగాను ఒక్కకొడుకువి. పువ్వుల్లో పెరిగావ్. నామాటవిని ఆపని మానెయ్యరా బాబూ!

[శ్యామల మంచినీరు తీసుకువచ్చి సూర్యంముందు పెడుతుంది]

సూర్యం: [చెంబుచేత్తో తీసుకొని] అమ్మా! నువ్వుకూడా యిలా మాట్లాడితే యెలాచెప్పు. చూస్తూనే వున్నావుగా రెండేళ్ళ మట్టీ యీ వెధవ ఉద్యోగాల కోసం ఎలా తిరుగుతున్నానో! ఏం నన్ను చావమంటావా? రోజుకు అర్ధరూపా యిస్తున్నారు. మనకదేచాలు.

శేషమ్మ: నా పిండాకూడు. ఉప్పువుంటే పప్పులేదాయె. పప్పువుంటే ఉప్పు లేదాయె! చేసి చేసి వస్తావ్. నాలుగు ముక్కలయినా చేసి పెట్టడానికి నోచుకోలేదు. ఎందుకు యీ వెధవ జన్మయెత్తి. ఆయనతో పాటు ఆ భగవంతుడు నన్నుకూడా తీసుకు పోగూడదూ?

సూర్యం: అసలు మన భావాలన్నీ యిలా వుండబట్టే మనకు ముక్తి లేకుండా చేసాడు భగవంతుడు. వెనుకటి రోజులు రమ్మంటే యెలావస్తయి? కాలాన్ని అనుసరించి పోవద్దూ?

శేషమ్మ: అయ్యో, నేనేమన్నానురా?

శ్యామల: యింకేం అనాలి? చేసి చేసి వస్తాడంటావ్. వచ్చింతర్వాత ఒక్క క్షణమైనా వాణ్ణి ఊరుకోనివ్వవు గదా!

సూర్యం: గుప్పెడు మెతుకులు దొరికే విధం యెలారా అని నేను ఆలోచిస్తూవుంటే, నాలుగు ముక్కలు చేసి పెట్ట లేదని నీయేడ్పాయె. ఈ దారిద్ర్యంతో మనమే ముక్కలై పోతూవుంటే, యింకా ముక్కలు కూడా దేనికి?

శ్యామల: ఊరుకో అన్నయ్యా! అమ్మ యేదో తెలియక మాట్లాడింది. నువ్వు కోపగిస్తేయెలా?

శేషమ్మ: అయ్యో! నేనేమన్నానే! యఫ్. యె. దాకా చదివావ్. యీ కూలీపని దేనికిరా...అన్నాను. యింతే కదమ్మా!

సూర్యం: చూడు, మళ్ళా యెట్లా మాట్లాడుతోందో! మన ప్రియత్నం మనం చేయాలి. వచ్చిందాంతో సంతృప్తి పడాలి. యిటు కూలీపని మానుకొని, అటు ఉద్యోగం లేక, మరి సంసారం గడవటంయెలా!...చచ్చేదాకా బ్రతకద్దూ మరి!

శేషమ్మ: యేమో బాబూ. మీతో యేంమాట్లాడినా తప్పే.

శ్యామల: ఊరుకోవమ్మా. నీపని నీవు చూసుకుందూ.

శేషమ్మ: [లేచి గొణుక్కుంటూ] అయినా నాకెందుకు. పొద్దు కూకవస్తోంది కూడా.

[అని బియ్యపుచేట తీసుకొని శేషమ్మలోపల కెళ్తుంది.]

సూర్యం: అయినా, వృద్ధాప్యంలోవున్న తల్లిని సంతోష పెట్టలేక పోతున్నానని సిగ్గుపడక నా విసుగంతా ఆవిడ మీాద చూపిస్తే యేంలాభం!

శ్యామల: [నెమ్మదిగా సూర్యాన్ని సమీపిస్తూ] అన్నయ్యా!
సూర్యం: ఏమిటమ్మా?
శ్యామల: నాకుకూడా యెక్కడయినా ఉద్యోగం వుంటే చూడన్నయ్యా.
సూర్యం: చిన్నదానవు. నీ కెందుకమ్మా కష్టం.
శ్యామల: మరి, నీ కూలీ డబ్బులు మనకోవ్పూట కూడా చాలడం లేదు.
సూర్యం: ఏం చేస్తాం? దానిలోనే సరిపెట్టుకోవాలి.
శ్యామల: ఏంసరిపెట్టుకోటం. అమ్మ అన్నట్టు ఏది మానాం చెప్పు. కట్టెలయిపోయినయి. నీతో చెప్పలేక వూరుకుంది. నిన్న వీరాసామిగారింట్లో బదులు తెచ్చిన నూకలుకూడా అయిపోయినయి.
సూర్యం: బాగానే వుంది. ఆ వచ్చే నాలుగు డబ్బులూ మీ చేతిలోనే పెడుతున్నానా.
శ్యామల: అందుకనే నాకుకూడా యెక్కడయినా ఉద్యోగం చూడ మంటున్నాను.
సూర్యం: యేం ఉద్యోగంచేస్తావ్?
శ్యామల: యేదయినా సరే.
సూర్యం: రెండేళ్లు తిరిగితే నాకు మోక్షంలేదు గానీ యిహ నీకు చూసిపెట్టే శక్తి కూడానా!
శ్యామల: పోనీ మీ ఫాక్టరీలో, నీతోపాటు నేనుకూడా పని చేస్తాను.

సూర్యం: నర్లే. ఊరుకో! యీ మాట అమ్మముందనేవ్. నరానరిపోయి బావిలో దూకుతుంది.

శ్యామల: కాదన్నయ్యా! నేనూ నాలుగుడబ్బులు సంపాదిస్తూ వుంటే, యీ కాపరం గట్టెక్కుతుంది గాని, లేకపోతే బావిలో దూకడమే మేలు!

సూర్యం: ఇదిగో శ్యామలా! యెందుకమ్మా నీకీ సంసారవు గోడవలు. హాయిగా సాటిపిల్లలతో, ఆటపాటల్లో కొన్నాళ్లయినా యీపాడు ప్రపంచాన్ని మరచిపో తల్లీ!

[అని సూర్యం మాట్లాడుతూ వుండగా కామ్రేడ్ శివం ప్రవేశం. కాకీనిక్కరు. ఖద్దరు అఫ్‌షర్టు. కళ్ళజోడు. చేతిలో ఒకఖాదీసంచి. కాళ్ళకు మేజోళ్ళూ, బూట్సూ]

శివం: [వస్తూనే] గుడ్ యీవినింగ్, కామ్రేడ్ సూర్యం! గుడ్ యీవినింగ్!

[అని అక్కడ కుర్చీకోసం వెతుకుతూ సంచుంటాడు. సూర్యం "ఎవరాయితను, పరిచయమున్నట్లుగా మాట్లాడుతున్నా"డని కామ్రేడ్ శివంవంక నిర్ఘాంతపోయి చూస్తాడు. అది కామ్రేడ్ శివం చూసి]

ఓ! అయామ్‌సారీ! మీరెప్పుడూ నన్ను చూడలేదనుకుంటాను. నేను ఈ జిల్లా కార్మిక సంఘానికి సెక్రెటరీని. నన్ను కామ్రేడ్ శివం అంటారు.

సూర్యం: ఓ! అలాగా, దయచేయండి. [అని మంచంమీద కూచోమని చూపిస్తాడు] ఈ అమ్మాయి నాచెల్లెలు. శ్యామల.

శివం: ఐసీ!...నేనీ వూరు చాలా అత్యావసరమైన పనిమీద

వచ్చాను. యిక్కడ కార్మిక సంఘం బాగా పనిచేయడం లేదని మాజిల్లా ఆఫీసుకు రిపోర్టు లొస్తున్నాయి. సంఘాన్నంతా మరామత్తుచేసి రావలసిందని నన్ను జిల్లా ఆఫీసువారు డిప్యూట్ చేసారు. నేచెప్పేదేమిటంటే, ఇక్కడ కార్మికుల్నందర్నీ ఆర్గనైజు చేసేభారం, మీరు వహించాలి. [శ్యామలవంక తిరిగి] కొంచెం, వాటర్ తెచ్చిపెట్టమ్మా

[శ్యామల మంచినీటి కోసం లోపలి కెళ్తుంది.]

సూర్యం: మీరు నన్ను క్షమించాలి. అలాంటిపని నాచేత కాదు.

శివం: మీరలా అంటే నేను ఒప్పుకోను. నేచెప్పేదేమిటంటే ఎడ్యుకేటెడ్ పీపుల్ కార్మికసంఘాల్లో చేరాలి. కార్మికుల్లో విప్లవ జ్యోతులు వెలిగించాలి. వారిని ఈ బూర్జువా సంకెళ్ళనుండి విముక్తులను చెయ్యాలి. మీరు కాదనడానికి వీల్లేదు. మీరు కాదన్నా మేము ఒప్పుకోము. కార్మికులకు మీచేతనయిన సహాయం చేయడం మీ విధ్యుక్తధర్మం.

[శ్యామల మంచినీరు తెస్తుంది.]

సూర్యం: అయితే నన్నేంచేయ మంటారు?

శివం: ఈ మిల్లుల్లో కార్మికుల్నందర్నీ ఆర్గనైజు చేసే భారం మీది.

సూర్యం: నేను కొత్తగా ప్రవేశించాను. ఇలాంటి వాటిల్లో నా కనుభవం లేదు. సంఘంమాట దేవుడెరుగు. ముందు

యింటిని చక్కబెట్టుకుంటే చాలు. ఏదో తిండికి లోటు లేనివాళ్లు ముందంజ వేయాలి గానీ!

శ్యామల: ఎందుకు బాబూ మాకివన్నీ!

శివం: నీకు తెలియదమ్మా. మొదట రష్యాలోకూడా అలాగే అనుకున్నారు. తర్వాత లెనిన్ వచ్చి శంఖారావం చేస్తే, ఒక్కసారిగా గాఢనిద్రలో మునిగివున్న కార్మిక కర్షక ప్రజ లేచి, బూర్జువా ప్రభుత్వాన్ని, మూడు నిమిషాల్లో, మూడు నిమిషాల్లో కూలదోసింది. నేను చెప్పేదేమిటంటే, అలాంటి శక్తి, అలాంటి శౌర్యం మన కార్మిక వీరులకు కలుగ జెయ్యాలి. అదే మన శపథం. అదే మనదీక్ష !

సూర్యం: సరె. అలాగే కానివ్వండి. మీటింగ్ యెప్పుడు? రేపేనా?

శివం: అవును. రేపు సాయంకాలం అయిదు గంటలకు. మీ ఫాక్టరీ ముందు ఖాళీ స్థలంలో. మీరొక అరగంట ముందుగానే రండి.

సూర్యం: సరె. నన్నవసరంగా యీ మహాసముద్రంలోకి నెడుతున్నారు.

శ్యామల: మొన్ననే చేరావ్. ఆ ఉద్యోగం కాస్తా ఊడగొట్టుకోకు.

శివం: అహాహా ! ఎంత అంధకార బంధురంలో మునిగివుంది మనప్రజ! ప్రపంచకార్మిక యోగక్షేమాల కోసం, తుచ్ఛ

మన ఉద్యోగాలనా ? మన ప్రాణాలనూ, అవసర మొస్తే, నే చెప్పేదేమిటంటే, మన దేశాన్నికూడా బలి యివ్వాలి.

శ్యామల: ఎందుకు బాబూ? పెద్ద పెద్ద మాటలు.

సూర్యం: అయినా మనం చేసే కృషిలో వుండాలి గాని మాటల వల్ల యేం ప్రయోజనం.

శివం: అందుకనే గదండీ మిమ్మల్ని ఆర్గనైజరుగా వుండ మనడం. మేంచెప్పే మాటలన్నీ మీరు కార్య రూపేణా తీసుకురావాలి.

శ్యామల: అంటే మీరు చేసేదేమీ లేదనా?

[శేషమ్మ ప్రవేశం]

శేషమ్మ: ఏరా అబ్బాయి! పొద్దుపోవడంలా? భోజనానికిలే !

శివం: [శేషమ్మ వంక తిరిగి] నమస్కారమండీ.

శేషమ్మ: [శ్యామలతో] వారెవరే?

శ్యామల: అన్నయ్యకోసం యేదో పనిమీద వచ్చారు.

సూర్యం: మీరుకూడా లేవండి.

శివం: నాకు పనివుంది వెళ్తొస్తాను.

సూర్యం: భోంచేసి వెళ్దురుగాని.

శివం: ఆల్ రైట్! కామ్రేడ్ పిలుస్తుంటే రాననడం మా పార్టీలో తప్పు! [మంచంమీద కూర్చొని బూట్సు విడుస్తూ] చెంబుతో కాసినినీళ్లు తెచ్చి పెట్టమ్మా ! [తెర]

# నా దేశం

## 3 వ రంగము

రాధా మోహన్ యిల్లు

[రంగము కొద్దికొద్ది మార్పులతో మొదటి రంగము వలెనే అమర్చబడి వుంటుంది. కమల పాట పాడుకుంటూ వుంటుంది.]

కమల: [పాట]

ఓ దివ్యభారతీ! ఓ లోకపూజితా!
ఓ దివ్యభారతీ! ఓ లోకపూజితా!
పరప్రభుత్వపు చెరల నుక్కితివ నాతల్లి ॥ఓదివ్య॥
తొలినాటి నీకాంతి మాసిపోయినదేమో
దశదిశల నీకీర్తి ధ్వనియించినది గాదె ॥ఓదివ్య॥
నీ పుత్రరత్నములె, నీ చెరల విడిపింప,
సాగివస్తున్నారు, కలతజెందకు మాత,
ఓ దివ్యభారతీ! ఓ లోకపూజితా!

[పాట అయిపోతూ వుండగా అప్పడు చీటీతో ప్రవేశించి ఆచీటీ కమల కిస్తాడు. అది కమల చదువుకొని]

కమల: వారిని లోపలికి రమ్మను.

అప్పడు: సిత్తం.

[అప్పడు నిష్క్రమణ. సూర్యం ప్రవేశం]

సూర్యం: నమస్తే.

కమల: అలాకుర్చీమీద కూర్చో.

సూర్యం: మీరు యజమానులూ, మేముకూలీలం. మాకు కుర్చీలు కూడా దేనికిలెండి.

కమల: స్నేహితులమధ్య అలాంటి భేదాలువుండవేమో?

సూర్యం: సరే. మీ యిష్టం [అని సూర్యం కూర్చుంటాడు.]

కమల: ఏమిటి విశేషాలు? నీకు తీరికగా వున్నప్పుడు మా యింటికి వస్తూండకూడదూ? కాలేజీ లేని టైములో నాకేమీ తోచడమే లేదు.

సూర్యం: ఏరోజు కారోజు, ఈ రోజు గడవటం యెలాగురా అని ఆలోచిస్తూవుండే మాబోటి వాళ్ళకు, తీరికకూడా యెక్కడిది?

కమల: ఏం? నీకు పనిదొరికినా సంసార పరిస్థితి యథా ప్రకారంగానే వుందా?

సూర్యం: యథాప్రకారంగా వుంటే బాగుండును. అంతకన్నా అధ్వాన్న మయింది.

కమల: అవును. ఈ యుద్ధంవచ్చిం తర్వాత ధరలు విపరీతంగా పెరిగిపోయినయి.

సూర్యం: మీ అన్నగారిచ్చే కూలి మాకో పూట కూడా చాలడంలేదు.

కమల: పోనీ, కూలీ హెచ్చు చేయుమని అడగక పోయినారూ?

సూర్యం: అందుకనే మీ అన్నగారిని కలుసు కుందామ

వచ్చాను. ఈ మధ్య కార్మికులమంతా కలిసి మీటింగు చేశాం, యుద్ధ కాలంలో ధరలు విపరీతంగా పెరిగిపోయినయి గనుక కూలీ రెట్టింపు చేయాలని తీర్మానం చేశాం.

కమల: ఈ విషయం మా అన్నయ్యకు తెలిసిందా?

సూర్యం: మొన్ననే తీర్మానం కాపీ ఒకటి మీ అన్నగారికి అందజేశాం.

కమల: ఏమన్నాడు?

సూర్యం: ఇంటికి వచ్చి మాట్లాడ మన్నారు.

కమల: మా అన్నయ్య సామాన్యంగా లొంగే ఘటం కాదే!

సూర్యం: మా కోర్కెలను అంగీకరించక పోతే సమ్మె సాగిస్తామని కూడా చెప్పాం!

కమల: ఎందుకీ అవస్థ! యుద్ధం వచ్చిం తర్వాత గవర్నమెంటు వారు, పిలిచి ఉద్యోగాలిస్తున్నారట గదా! పోనీ, యేదన్నా ఉద్యోగంలో చేరక పోయావ్?

సూర్యం: యిప్పుడు చేస్తున్న పని వదలిపెట్టా?

కమల: ఏం? దీనివల్ల ఒక్కపూట కూడా జరగడం లేదని అన్నావు గదూ.

సూర్యం: తక్కినవాళ్ల గతి?

కమల: వాళ్ల గతి నీకెందుకూ.

సూర్యం: అలా అనడానికి వీల్లేదు. యీ ఫాక్టరీలో కూలీగా చేరిన తర్వాత నాకూ తక్కిన కూలీలకూ ఒక అవినాభావ

సంబంధం యేర్పడింది. నీకు చెపితే అతిశయోక్తిగా వుంటుంది. నామీద తక్కిన కూలీలంతా పెద్ద ఆశపెట్టుకున్నారు. వాళ్లను మధ్యలో వదలిపెట్టి నా బాగు చూసుకోటం యెంతమాత్రం యిష్టంలేదు.

కమల: సరే యింకేం! కొద్దిరోజుల్లో నువ్వు పెద్ద కార్మిక నాయకుడివి అయిపోతావన్న మాట!

సూర్యం: నాకీలాంటి అత్యాశ లేమీ లేవు! నేనూ ఒక కార్మికుణ్ణి కాబట్టి కార్మికుల అభివృద్ధికోసం పాటు పడతాను.

కమల: మరి మాస్కో-పార్టి వారంతా యీ యుద్ధ కాలంలో యిండియాలో పెద్ద రివల్యూషన్ తీసుకురావా లని సన్నాహం చేస్తున్నారట గదా? నీ కేమన్నా తెలిసిందా?

సూర్యం: ఈ మాస్కో-పార్టీ వారి పాలసీ నాకేమీ నచ్చడం లేదు.

కమల: ఎందుకని?

సూర్యం: యిన్నాళ్ళబట్టీ ఫాసిజం, నాజీజం అని కారాలు మిరియాలు నూరేవాళ్లు కాస్తా, రష్యా, జర్మనీతో సంధి చేసుకోంగానే, ఒక్కసారి నోర్లుకట్టేసుకున్నారు.

కమల: రేపు రష్యాకూ జర్మనీకీ వ్యవహారం చెడితేనో!

సూర్యం: ఏముంది! మళ్ళీ నాజీజం, ఫాసీజాం ప్రత్యక్షమవుతాయి.

కమల: అయితే వాళ్ళకు ఒక స్థిరమైన పాలసీ లేదంటావ్.

సూర్యం: ఎందుకు లేదు! అయితే ఆ పాలసీ యిక్కడ తయారు కాదు. మాస్కోలో తయారవుతుంది. అందు చేత వాళ్ల కెప్పుడూ మాస్కో క్షేమమేగాని మన దేశక్షేమంతో నిమిత్తం లేదు.

కమల: అయితే, మీ కార్మిక సంఘాలన్నీ మాస్కో పార్టీ ఆధ్వర్యాన నడుస్తున్నయ్యేమో!

సూర్యం: యిప్పటి వరకూ అంతే. కానీ మా కార్మిక సంఘంతో మాస్కో పార్టీకి యేమాత్రం సంబంధం లేకుండా చేయాలని ప్రయత్నిస్తున్నాను.

కమల: దాని వలన మీలో మీకు చీలికలు వస్తే.

సూర్యం: రాకుండా ప్రయత్నం చేస్తాం. ఈ మాస్కో పార్టీ వలన భారతీయులమైన మనకు యెలాంటి నష్టమున్నదో అందరికీ నచ్చచెపుతాం. నమ్మిన వాళ్లు నమ్ముతారు. నమ్మక పోతే మేమేం చేయగలం!

కమల: యీ యుద్ధంమీద నీ యభిప్రాయమేమిటి?

సూర్యం: సామ్రాజ్య తత్వంయొక్క దుష్ఫలితమే ఈ యుద్ధం.

కమల: అయితే మాస్కో పార్టీకీ మీకూ భేదం యేమిటి? వాళ్ళు "యిది సామ్రాజ్యతత్వం వలన వచ్చిన యుద్ధమే" అంటున్నారుగా?

సూర్యం: వాళ్ళు అలా అనడానికి వేరే కారణంవుంది. మాస్కోవారు అలా అనమన్నారు గనుక అలా

అంటున్నారు, రేపు మాస్కో నుంచి "యిది సామ్రాజ్యతత్వ యుద్ధం కాదు, ప్రజాయుద్ధ" మని తాఖీదువస్తే, మన మాస్కో పార్టీవారు వెంటనే ప్లేటు మార్చేస్తారు.

కమల: అయితే యీ యుద్ధకాలంలో మన కర్తవ్యం?

సూర్యం: మన వీలు మనం చూసుకోవడమే.

కమల: అంటే?

సూర్యం: ఈ యుద్ధంవల్ల బ్రిటన్ చాలా బలహీనమై పోయింది. అందుచేత భారతీయులమందరం కలసి "మాకు స్వరాజ్యం కావాలి" అని ఒత్తిడి చేస్తే బ్రిటన్ యిప్పుడు ఒప్పుకొనే పరిస్థితుల్లో వుంది. అలా ఒప్పుకోకపోతే ప్రచండమైన ఉద్యమాన్ని సాగించడానికి యిదే సమయం.

కమల: బ్రిటన్ కష్టదశలో వున్నప్పుడు, మనం బ్రిటన్ మీద దండెత్తటం న్యాయమేనా?

సూర్యం: న్యాయం, ధర్మం, దయ యిలాంటి మాటలు ఉపయోగించే ముందు, యెవరిని గురించి ఆ మాటలంటు న్నావో మరిచిపోకు. జలియన్ వాలాబాగ్‌లో స్త్రీలను, పిల్లలను మారణహోమం చేసిన బ్రిటన్ కేనా న్యాయం! వేలకొలది స్వాతంత్రి వీరులను ఉరికంబాని కెక్కించిన బ్రిటన్ కేనా ధర్మం. తిలక్, గాంధీ, నెహ్రూ, అజాద్ యిలాంటి లోకైక వీరులను జైళ్లల్లో వుంచి నానాహింసలు పెట్టిన బ్రిటన్ కేనా దయ! ముమ్మాటికీ అసంభవం. ఎంత వరకూ తన వాణిజ్యం, తన సౌభాగ్యమేగాని, యీ నల్లభై

కోట్ల భారతీయులలో ఒక్కనికోసమైనా తన స్వార్థాన్ని వదులుకున్నదా బ్రిటన్. కత్తిని కత్తితోనే యెదుర్కోవాలి. మోసాన్ని మోసంతోనే అణగార్చాలి. "పాపం! బ్రిటన్! చాలా అవస్థల్లోవుంది. దాన్ని ముట్టుకోకండి" అంటే నా హృదయం మండుకొని పోతుంది. ఇంతకష్టంలో వుండికూడా "మీకు స్వరాజ్యం తప్పకుండా యిస్తాం" అని తన నోటితో అనగలిగిందా? అలాంటి బ్రిటన్‌తో నాకు న్యాయమేమిటి? ధర్మమేమిటి? ఈ యుద్ధకాలంలోనే ఈ దేశంలో బ్రిటన్ వుండటమో, మనం వుండటమో తేల్చుకోవాల్సిందే.

కమల: హియర్, హియర్, యింత ఆవేశం నే నెప్పుడూ చూడ లేదు. ఇంక్విలాబ్ జిందాబాద్!

[రాధామోహన ప్రవేశం]

రాధామో: ఏమిటి? చెల్లెలుగారు చాలాతన్మయావస్థలో వున్నట్లున్నారు!

కమల: నాయిష్టం నాది.

రాధామో: సరె, నీయిష్టం. ఏమోయి సూర్యం, యెంత సేపయింది నువ్వొచ్చి?

సూర్యం: ఒక పావుగంట అయిందండి

రాధామో: మరి, మీరు నమ్మె నోటీసు విత్‌డ్రా చేసుకుంటారా లేదా?

సూర్యం: మా కోర్కెలను అంగీకరిస్తే తప్పకుండా విత్ డ్రా చేసుకుంటాం.

రాధామో: మీరు ముందు సమ్మె నోటీసు విత్ డ్రా చేసుకోండి. తర్వాత మీ కోర్కెలు న్యాయమని తోస్తే తప్పకుండా ఆలోచిస్తాను.

కమల: అసలు వాళ్ళు కోరేదేమిటి?

రాధామో: ఏముందీ! యుద్ధకాలంలో ధరలు విపరీతంగా పెరిగినయి గనుక కూలీ రెట్టింపు చెయ్యాలిట.

కమల: అవును. దాంట్లో తప్పేముందీ?

రాధామో: [కోపంతో] కమలా!

కమల: సరె, నీయిష్టం!

రాధామో: అంతేగాదు. అలాకూలీ పెంచకపోతే స్ట్రయిక్ చేస్తారట, స్ట్రయిక్! ఏమోయ్, యింట్లోతిని యింటివాసాలు లెక్కెడు తున్నావ్.

సూర్యం: నాదేముందండీ! అందరూ కలసి తీర్మానంచేస్తే అది నేను మీకు అందజేసాను.

రాధామో: పాపం! యెదో పూర్ ఫెలో, యేడుస్తున్నాడు గదా అని నేను పనిచూపిస్తే నువ్వేమాకు యెదురు తిరుగుతున్నా వన్నమాట.

కమల: యేదో ధర్మంగా పోషిస్తున్నట్లు మాట్లాడుతున్నావే! నువ్వు వూరికే యిస్తున్నావా? కష్టపడి పని చేస్తున్నాడు. నువ్వు కూలీ యిస్తున్నావు.

రాధామో: పని! ఆపని చూపించకపోతే యేమయేవాడో! బజార్ల వెంట అడుక్కుతినే వాడు.

సూర్యం: [మనస్సు చివుక్కుమని] యజమానులుగదా అని మీరు అనవసరంగా మాట్లాడకండి. మీకంత యిష్టంలేకపోతే నేనీపని మానుకుంటాను.

రాధామో: బెదిరిస్తున్నావే? అవును. బెదిరించక యేం చేస్తావ్. కార్మిక సంఘానికి కార్యదర్శివి. కూలిలంతా నీ చేతిలో వుండిరి. కూలీ హెచ్చించకపోతే సమ్మె. తగ్గిస్తే సమ్మె. కూలిని తీసేస్తే సమ్మె. అంతా మీ యిష్టా రాజ్యం లాగా వుంది.

కమల: కాకపోతే యీ హంసతూలికా తల్పాలలో యెన్ని రోజులు కులుకుదామను కుంటున్నావు?

రాధామో: మిస్ కమలా! నా బిజినెస్ విషయాల్లో అనవసరంగా జోక్యం కలుగ జేసుకోకు. తెలిసిందా?

కమల: అయినా "కందకులేని దురద కత్తిపీట" కన్నట్లు, నాకెందుకు. నీ యిష్టం నీది.

రాధామో: థాంక్స్.

[కమల నిష్క్రమణ]

సూర్యం: మరి నాపనికి వేళయింది. యేమని సెలవిస్తారు?

రాధామో: అయితే మీరు కూలీ యెక్కువ చేయకపోతే సమ్మె చేస్తారన్నమాట, అంతేనా?

సూర్యం: అంతదాకా రాదనుకుంటాను. మీరే ఈ కాటకపు రోజుల్లో కార్మికుల కష్టాలు కనిపెట్టి వాళ్ళ కోర్కెలను అంగీకరిస్తారని నానమ్మకం.

రాధామో: అంగీకరించక పోతే,

సూర్యం: అంగీకరించక పోతే మాహక్కులకోసం మేము పోరాడతాం. తర్వాత మీ యిష్టం. సెలవు.

[సూర్యం నిష్క్రమణ.]

రాధామో: [సూర్యం దూరమౌతున్నకొద్దీ గొంతుపెద్దదిచేస్తూ] పోరాడ! తావ్! యెవరితో పోరాడుతున్నావో జ్ఞప్తియుంచుకో.

[అని రెండోవైపుకు రాధామోహన్ నిష్క్రమణ]

[తెర]



# నా దే శం

## 4 వ రం గ ము

### రా ధా మో హ న్ ఇ ల్లు

[ఉదయం 9 గంటలు. భానుమూర్తి పేపరు చదువుకుంటూ వుంటాడు. స్టేజి మొదటి సీనువలె అరేంజి చేయబడి వుంటుంది.]

భాను: [పేపరు చదువుతూ] ఆఁ! ఆఁ! ఆరి వీడి తస్సాగొయ్యా! అరవైమైళ్లే! మూడు రోజులయినా కాలేదు! అరవై మైళ్లే! [అటూయిటూ చూసి] అప్పడూ! అరే, అప్పడూ!

[హడావుడిగా అప్పడు ప్రవేశం]

అప్పడు: ఏంటండీ బాబయ్యా?

భాను: యింకా "ఏంటండీ బాబయ్యా" యేమిటాి! మూడు రోజులైనా కాలేదు. అరవైమైళ్లు వెళ్లి పోయాడురా!

అప్పడు: ఏ రండి బాబయ్యా?

భాను: జర్మనీవాడురా! రష్యాఅంతా వాడి కాలికింద దద్దరిల్లి పోతోందిట.

అప్పడు: అయ్యబాబోయి! యిహాఆణ్ణి ఆపేవాడు లేడాఅండి.

భాను: వాణ్ణి ఆపేవాడే! ఆ బ్రహ్మకైనా తరంకాదనుకో. పేపర్లో యేం రాశారో విన్నావూ? [చదువుతూ] "నికి వన్నికి దగ్గర పదిహేను వేలమంది రష్యన్ సైనికులు

పట్టు బడ్డారు. పోవ్‌లోవు దగ్గర యిరవైవేలు. ప్రీవీన్ దగ్గర ముప్పైయి వేల సైనికులు రష్యాకు నష్టం."

అప్పడు: ముప్పయియేలే బాబయ్యా!

భాను: అప్పుడే అయిందీ [మళ్లీ పేపరు చదువుతూ] "ఈశాన్య రంగంలో యిరవై అయిదు వేల రష్యన్ సైనికులూ, ఆఫీసర్లూ జర్మనులకు ఖైదీలుగా చిక్కారు." [అప్పడి వంక చూసి ప్రతిమాట నొక్కుతూ] మొత్తం ఒకలక్ష సైన్యం.

అప్పడు: [నోరు తెరుచుకొని] ఒకలచ్చే! అయ్యబాబోయ్.

భాను: ఒక్క రోజులో!

అప్పడు: ఒక్క రోజులో! అయ్యబాబోయ్!

భాను: యిహలాభం లేదురా! వాడి దెబ్బకు తట్టుకునే వాళ్ళు యీ ప్రపంచంలో యెవ్వరూ లేరనుకో!

అప్పడు: [తలగోక్కుంటూ] అయితే బాబయ్యా! యిహమనోళ్ళ పని పిట్టం కట్టినట్టేనా.

భాను: మన వాళ్ళంటే?

అప్పడు: అదేనండి బాబయ్యా, మన రస్యావోళ్లు.

భాను: మనరష్యా వాళ్ళంటే?

అప్పడు: అదేనండి బాబయ్యా! రస్యారస్యా అంటూండరూ, ఆళ్ళూ!

భాను: [నవ్వుతూ] ఓ! మన మాస్కోపార్టీవారిని గురించా? నువ్వనేది?

అప్పడు: ఏ యిస్కోనండి. నా కా మూల ముక్కలు రావండి. అయితే బాబయ్యా! "రస్యా, రస్యా"అంటారుగందా, యీళ్లది రస్యా దేశమా అండి?

భాను: ఎబ్బే, వాళ్ళదీ మన దేశమేరా!

అప్పడు: ఆళ్ళతాత ముత్తాతల్లి రస్యాదేశమా?

భాను: వాళ్ల తాతముత్తాతల్లి కూడా మన దేశమే. మన దేశం వాళ్ళకు మాతృదేశమయితే,రష్యాపితృదేశం అన్నమాట.

అప్పడు: ఓ అదాఅండి! ...ఆళ్ళ అయ్యల్లి రస్యాదేశమన్న మాట. అంతేగదూ బాబయ్యా!

భాను: ఛా వెధవా! వాళ్ల తండ్రుల్లి కూడా మనదేశమే!

అప్పడు: ఏమోనండి బాబయ్యా! ఎప్పుడూ "రస్యా, రస్యా" అంటే ఆళ్ళు ఆదేశంనుంచి వచ్చారేమో ననుకున్నాను.

భాను: అబ్బె అదిగాదురా! రష్యాఅంటే వాళ్లకు స్వర్గం. అందుచేత దానిపేరు యెప్పుడూ తలుచుకుంటూ వుంటారు.

అప్పడు: [అంతా అర్థమయినట్లు] ఓ! అదాఅండి! మరిసెప్పరేం బాబయ్యా. రస్యా స్వర్గమాఅండి. అంటే, యీళ్లంతా నస్సిపోయిం తర్వాత రస్యాలో తేల్తారన్నమాట. అంతేనా బాబయ్యా!

[అప్పుడి తెలివితక్కువకు భానుమూర్తి నవ్వుతూ వుంటాడు. అప్పడు తన యజమాని నవ్వుతూ వున్నాడుగదా అని తానూ నవ్వటం ప్రారంభిస్తాడు. ఒకరినిమించి ఒకరు నవ్వుతూ వుండగా రాధామోహన్ ప్రవేశం. యిద్దరూనవ్వు ఆపుకుంటారు.]

రాధామో: గుడ్‌మార్నింగ్, డాడీ!

భాను: గుడ్ మార్నింగ్. కారొచ్చిందా?

రాధామో: ఆ. మీ రెక్కడకన్నా వెళ్ళాలాయేమిటి?

భాను: బజారులో పనుంది. నీకోసమే యెదురు చూస్తున్నాను.

రాధామో: అయితే తొందరగా వెళ్లండి. కారు షెడ్డులో పెడతాడేమో.

[భానుమూర్తి బైటకు వెళ్లిపోతాడు. అప్పడు చేతులు నలుపుకుంటూ నిలబడతాడు. రాధామోహన్ కుర్చీలో కూర్చొని సిగిరెట్ వెలిగించి.]

ఏరా అప్పడూ నిన్న మన ఫ్యాక్టరీ వేపు వెళ్లావా?

అప్పడు: ఎల్లానండి బాబయ్యా.

రాధామో: అరే అప్పడూ! నిన్ను "సార్" అనడం నేర్చుకోరాఅని, యెన్నిసార్లు చెప్పానురా? "బాబయ్యా" యేమిటా! ఒక్కసారి తాలూకా ఆఫీసుకు పోయిచూడు. ఆ గుమాస్తాలు పిలిచీ పిలవడంతోటే "సార్, సార్" అని ఎంతచక్కగా హాజరవుతారో. ఇహానుంచి "సార్" అనడం నేర్చుకో.

అప్పడు: సిత్తం బాబయ్యా: [రాధామోహన్ కోపంగా చూస్తాడు]. సార్!

రాధామో: సమ్మె బాగా సాగుతోందా?

అప్పడు: బాగాయేంటి బాబయ్యా. సార్. మాంజోరుగా సాగుతోందండి.

రాధామో: తగ్గే సూచనలేమీ కనబడటం లేదన్నమాట.

అప్పడు: తగ్గే సూచేన లేంటి బాబయ్యా! పక్కామిల్లులకుకూడా పాకిపోతుం టేను.

రాధామో: మరి యీ సమ్మెకంతా నాయకులెవరో తెలుసు కున్నావా?

అప్పడు: బాబో! అదంతా మాసముద్రంలాగా వుందండి. యార్నడిగేది? యామడిగేది?

రాధామో: ఏడ్చావ్! వాళ్లందరితో కలిసీ మెలిసీ తిరిగి, నాయకులెవరో ఆచోకీ తీసుకురమ్మని చెప్పలా?

అప్పడు: ఏం చేసేది బాబయ్యా...సార్! నేనక్కడికి యెళ్లి పోంగానే నలుగురూ నా సుట్టూసేరి "ఆరి నన్ను పీనుగా! మామీద మీ దొరకి పితూరీలు సెప్పడానికి వశ్శావా" అని నన్ను తన్నబోయారండి.

రాధామో: "నాకూ, మా దొరకీ యేమీ సంబంధం లే"దని చెప్పక పోయావ్! స్టుపిడ్!

అప్పడు: సెప్పానండి సార్! అప్పటికీ నామాట నమ్మ లేదండి.

రాధామో: మరి...నన్ను నాలుగు తిట్టకపోయావ్.

అప్పడు: అదికూడా సేశానండి.

రాధామో: వాళ్లకు నచ్చేలాగా తిట్టాలిరా. [నవ్వుతూ] ఏమని తిట్టావురా?...ఫరవా లేదు. చెప్పు, ఏమన్నా వేంకి

అప్పడు: మరండీ, బాబయ్యా! తమరు...ముండల ముఠాకో

రనీ, బాగా తాగుతారనీ, యింట్లో వీరంటే ఓరికీ యిష్టంలేదనీ. యింకా సాలా, సాలా అన్నానండి.

రాధామో: ఆరి నీదుంప తెగ! మరి అప్పుడైనా నీమాటలు నమ్మారా?

అప్పడు: దాంతో కొంతవరకు పాసిక పారిందండి. ఆళ్లతో కల్సి "కార్మిక సంగాలకు జై" "ఎంకిలావ్, సికింద్రాబాద్" అని గొంతు సిల్లులడేటట్లు అరిశానండి.

రాధామో: ఎందుకురా వెధవసోది? యింతకీ యీ నమ్మకంతా కారకులెవరో తెలుసు కున్నావా?

అప్పడు: నలుగు రైదుగుర్ని కదిల్సి సూశానండి. దీనికంతా కారణం ఆ సూర్యం అంటండి. ఆడిమాటకు యెదురు లేదంటండి.

రాధామో: అతనొక్కడేనా? యింకెవరన్నా ఉన్నారా?

అప్పడు: మరండీ. ఈరాసామి తెలుసాఅండి, ఆడొకడండి. దొమ్ములాటకైనా "లడీ"అంటున్నాడండి.

రాధామో: ఊహూ! ఏమయినానరే. యీతఘావీళ్ళకో పాఠం నేర్పితేగాని లాభంలేదు. పోలీసులకు కబురంపానులే. యీ వేళ సాయింత్రిం యిటో అటో తేలిపోవాలి.

అప్పడు: అంతేబాబయ్యా...సార్. దయుదల్సిన కొద్ది మీాది మీాదికి వత్తుండారు.

[తెరలోనుంచి]

"హాల్లో" మిస్టర్ రాధామోహన్ వున్నారా అండి?

రాధామో: అరే అప్పడూ! యెవరో పిలుస్తున్నారు. పోయి చూసిరా.

[అప్పడు వెళ్తాడు. రాధామోహన్ కొంచెం కాఫ్రీ, డ్రిన్కూ సద్దుకుంటూ వుంటాడు. అప్పడు తిరిగివచ్చి ఒక విజిటింగు కార్డు రాధామోహన్ చేతికిస్తాడు. రాధామోహన్ అది చదివి]

లోపలికిరమ్మను. [అప్పడు బైటకు వెళ్తాడు. విజిటింగ్ కార్డు పైనున్న మాటలు చదువుతూ] "ఎ. వి. శివం. ఛీఫ్ ఆర్గనైజర్, ది కలకొండా డిస్ట్రిక్టు లేబరు యూనియన్."

[శివం ప్రవేశం.]

శివం: గుడ్ మార్నింగ్ సార్!

రాధామో: గుడ్ మార్నింగ్! ఏం పనిమీద వచ్చారు?

శివం: మీరు రోజూ పేపరు చూస్తున్నారా?

రాధామో: ఎందుకూ?

శివం; [ఆవేశంతో] రష్యామీద జర్మనీ యుద్ధం ప్రకటించడం. జర్మనీ టాంకులు రష్యామీదకు దూకడం.

రాధామో: అయితే?

శివం: ఏం లేదు. దాంతో యీ యుద్ధంయొక్క పరిస్థితి పూర్తిగా మారిపోయిందని మీకు చెప్పడానికి వచ్చాను.

రాధామో: నాకెందుకయ్యా, ఆ విషయాలన్నీ?

శివం: [రాధామోహన్ మాటలు వినిపించుకోకుండా] ఈ యుద్ధ పరిస్థితే గాదు. దీంతో, నే చెప్పేదేమిటంటే, మీకూ మాకూ వున్న సంబంధం పూర్తిగా మారి పోయింది.

రాధామో: అంటే ?

శివం: ఏనాడయితే ఫాసిష్టు ప్రభుత్వం ప్రజారాజ్యం మీద కత్తి దూసిందో ఆనాడే యిది ప్రజాయుద్ధ మయిపోయింది. ఫాసిష్టు శక్తుల కెదురుగా ప్రజా శక్తులు నిలచి పోరాడుతున్నాయి. నే చెప్పేదేమిటంటే ఫాసిష్టు శక్తులను రూపు మాపి ప్రజాశక్తులను నిలబెట్టడం మన విధ్యుక్త ధర్మం. ఫాసిష్టు శక్తులను రూపు మాపాలంటే, మన సోవియట్ ప్రభుత్వం, ఈ యుద్ధంలో, దిగ్విజయంతో, బయట పడాలంటే, దానికి అండగా నిల్చిన బ్రిటన్‌కు, మనం సహాయం చేయాలి. నియంతృత్వాన్ని నిర్మూలించాలి. నే చెప్పేదేమిటంటే, యిహనుంచి, మేమూ, మా పార్టీ, బ్రిటన్‌కు శత్రువుగా గాక, మిత్రుడుగా మారిపోవడానికి నిశ్చయం చేసుకుంది.

రాధామో: మంచిపని చేసింది. అయితే కామ్రేడ్ ! ఈ కుంభవర్షం కురింపించడానికి నేనే దొరికానూ? మీ కామేడ్రులు చాలామంది వున్నారనుకుంటా.

శివం: [కోపం వచ్చినట్లు ముఖం చిట్లించుకొని] నేనుచాలా సీరియస్‌గా మాట్లాడుతున్నాను. వెక్కిరింపులకూ, వేళాకోళాలకూ, యిది సమయంగాదు. ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితుల్లోని గూఢార్థాన్ని మీరు గమనించడం లేదు. నే చెప్పేదేమిటంటే...

రాధామో: [“మళ్ళీ ఒక పెద్దఉపన్యాసం యివ్వడానికి ప్రారంభిస్తున్నాడురా” అని భయపడి శివంమాటకు అడ్డంవస్తూ] కామ్రేడ్! కామ్రేడ్! మీ మాటకు అడ్డంవచ్చినందుకు నన్ను క్షమించాలి. నాకు సంబంధించినంత వరకూ మీరు యేపని మీదవచ్చారో సెలవిస్తే చాలా సంతోషిస్తాను.

శివం: [కీవితో] నేచెప్పేదేమిటంటే, యిహానుంచి మిల్లుల్లోగాని, కర్మాగారాల్లోగాని, ఆ మాటకువస్తే యిండియాలో యెక్కడా సమ్మెలనేవి వుండవు. వ్యతిరేక ప్రదర్శనా లుండవు. యుద్ధం వుండేంత వరకూ యజమానులూ, కూలీలూ కలిసి పనిచేస్తారు. నేను చెప్పేదేమిటంటే, భారతీయుల మందరం కలసి పనిచేసి,ఈ బ్రిటిష్ ప్రభుత్వానికి యుద్ధంలో విజయాన్ని చేకూర్చాలి. బ్రిటిష్ విజయమే, సోవియట్ విజయం. సోవియట్ విజయమే, మన విజయం. కనుక విప్లవం వర్ధిల్లాలి! సోవియట్ వ్యతిరేక ... [అనియింకా అనబోతూ, అది ప్లాటుఫారం కాదని తెలుసుకొని, ముఖం చిన్నబుచ్చుకొని యికిలిస్తూ] ఐయామ్ సారీ!

రాధామో: నెవర్ మైన్డ్!! అదా విషయం. మరి చెప్పరేం. అప్పడూ! ఒరే, అప్పడూ!

[అప్పడు ప్రవేశం.]

అరేయి, కాఫీ తీసుకురా. వెంటనే, అర్జంటు!

[అప్పడు నిష్క్రమణ]

ఆc. ఏమంటారు? యిహానుంచి, సమ్మెలూ, వ్యతిరేక ప్రదర్శనాలూ వుండవంటారా?

శివం: వుండవు.

రాధామో: యజమానులూ, కూలీలూ యేకమై యుద్ధం ముగిసేవరకూ బ్రిటిష్ ప్రభుత్వానికి శాయశక్తులా సాయం చేయాలంటారు. అంతేగదూ?

శివం: అవును.

[అప్పుడు కాఫీ యిచ్చి వెళ్లిపోతాడు.]

రాధామో: [కాఫీ తీసుకుంటూ] మరి మా మిల్లులోని పరిస్థితులు మీకు తెలియ వనుకుంటాను.

శివం: ఎందుకు తెలియవ్వా?

రాధామో: తెలిస్తే, మీరిలా మాట్లాడి వుండరు.

శివం: ఏం?

రాధామో: ప్రస్తుతం మా మిల్లులో కూలీలంతా సమ్మె చేస్తున్నారు. తెలుసునా?

శివం: తెలియకేం. మా జిల్లా ఆఫీసునుంచి, సరాసరి మీ యింటికే వచ్చాను. ఇచ్చటి కార్మిక నాయకుల్ని యింకా కలుసుకోలేదు. ఈ రోజు సాయంకాలమే, సమ్మె ఆవు చేసే పూచీ నాది.

రాధామో: థాంక్ యూ! యింకా ఆలస్యం దేనికి?

శివం: అయితే ఒక్క విషయం. యుద్ధం వల్ల ధర లెలా పెరిగిపోయాయో మీకు తెలియని విషయంకాదు. అందుచేత కూలీ విషయంలో వాళ్ల కోర్కెలను మన్నిస్తే మంచిదనుకుంటాను.

రాధామో: వాళ్ళ కోర్కెలను మన్నించేటట్లయితే యీ పోదంతా యెందుకండీ? మీరు మాకు చేసే సహాయ మేమిటి!

శివం: నే చెప్పేదేమిటంటే, వాళ్లు కోరినంత కాకపోయినా, కొంతయినా కూలీ హెచ్చించాలి. లేకపోతే నామాటకు కూడా విలువుండదు. యుద్ధం ముగిసేలోపల కొన్ని లక్షలు సంపాదిస్తారే!

రాధామో: సరే! మీరే చెప్పండి, కూలీ యెంతవరకు హెచ్చించాలో.

శివం: మీరిప్పుడు అర్ధరూపాయి యిస్తున్నట్టున్నారు. వాళ్లు రెట్టింపు అడుగుతున్నారు. పోనీ ఓటూాయనాస్ తగ్గించు కొని పద్దాలుగణాలకు ఫైసలు చేయండి.

రాధామో: ఏమిటీ? రోజుకు పద్ధాలుగణాలా? [ఆలోచించి] పదణాలిస్తాను. ఇష్టమయితే వుండమనండి. లేకపోతే, మాతిప్పలు మేంపడతాం.

శివం: పోనీ, పన్నెండణాలకు ఫైసలుచేయండి.

రాధామో: అబ్బే, లాభంలేదయ్యా. అంతగాఅయితే మిల్లు మూసేస్తాం. అప్పుడు వీళ్ళకు కూడుపెట్టే వాడెవడో చూస్తాం.

శివం: అదేమిటండోయ్, బెదిరిస్తున్నారు. అంతగా అయితే మిలిటరీలో జేర్పిస్తాను... నా మాట తోసెయ్యకండి.

తర్వాత మన చేతుల్లోంచి దాటిపోయిందంటే లాభం లేదు. ప్రతిదానికీ పట్టూ, విడుపూ వుండాలి.

రాధామో: [కొంచెంసేపు ఆలోచించి, దీర్ఘంగా శివం వంక చూస్తూ] తప్పదన్న మాటేనా?

శివం: [ఇకిలిస్తూ] నామాటవినండి. నేచెప్పేదేమిటంటే...

రాధామో: ఆల్ రైట్! సమ్మెలూ, గిమ్మెలూ జరక్కుండా చూసేబాధ్యత మీది.

శివం: [సంతోషంతో లేస్తూ] యింకానా?

రాధామో: యూ ప్రామిస్?

శివం: ష్యూర్లీ! మరి... సెలవు.

[శివంనిష్క్రమణ]

రాధామో: అప్పడూ! అరే అప్పడూ!

అప్పడు: [లోపలినుంచి] సార్! సార్! [అని ప్రవేశం]

రాధామో! [జేబులోనుంచి ఒక రూపాయి కాసుతీసి అప్పడికిస్తూ] అరేయ్, ఈ రూపాయి పెట్టి యేమన్నా కొనుక్కోరా పోయి.

అప్పడు: సిత్తం బాబయ్యా. [రాధామోహన్ కోపంగా చూస్తాడు] ...సార్.

[రాధామోహన్ నిష్క్రమణ.]

## —* స్వాతంత్ర్య గీతం *—

స్వాగతమనవోయీ !
స్వాగత మనవోయీ !
హిమగిరి శిఖరము, వింధ్యవనీంద్రము
కన్యకుమారీ పదడిండీరము,
స్ఫురితము, భరితము, చలితోల్లలితము,
స్వాతంత్ర్యముచే, స్వాతంత్ర్యముకై
స్వాగత మనవోయీ !
స్వాగత మనవోయీ !
గుజరాట్ అంగ వంగ మరాటా
త్రిలింగ తమ్మిళ కళింగమును జను
లజరులు అమరులు అనామయులుగా
స్వాతంత్ర్యముచే, స్వాతంత్ర్యముకై
స్వాగత మనవోయీ !
స్వాగత మనవోయీ !
గంగాయమునా కృష్ణపినాకిని
కావేరి నర్మద తపతీ సింధులు
అహర్నిశాదులు ఒకటే గానము,
అలలో, కలలో, అదే ప్రయాణము
స్వాతంత్ర్యముచే, స్వాతంత్ర్యముకై
స్వాగత మనవోయీ !
స్వాగత మనవోయీ !

(కవికొండల వెంకటరావుగారి అనుమతితో.)

# నా దేశం

## 5 వ రంగము

సూర్యం యిల్లు

[సాయంకాలం, తల్లి శేషమ్మ కసువూడ్చుకుంటూ వుంటుంది. శ్యామల పాట పాడుకుంటూ వుంటుంది.]

జై! జై! జై! జై!
జాతి పతాకమ ॥జై జై॥
నిత్యజీవివై నెగడు పతాకమ ॥జై జై॥
రంగుబేధ మేర్పడుట తెలిసికొని
రంగులైక్యమూ చేయు పతాకమ ॥జై జై॥
సత్యమహింసా స్వాత్వ్యంత్రింబులె
సార రూపమగు శాంతి పతాకమ
జై! జై! జై! జై!
జాతి పతాకమ.

[పాట పూర్తి అవుతుండగా సూర్యం, యింకా కొంతమంది వాలం టీర్లు దెబ్బలు తగిలిన ఒక వాలంటీరును మోసుకుంటూ వస్తారు. శాస్త్రేమ్ శివంవారి వెనుక వస్తాడు. వచ్చి, కోప ముఖంతో అటూ యిటూ పచార్లు చేస్తూ వుంటాడు. తల్లి అదుర్దాతో దెబ్బలు తగిలిన వాలంటీరును సమీ పిస్తూ]

శేషమ్మ : ఏమిటా్రినాయనా ! [దగ్గరకు వచ్చి] అయ్యో! యిూ

రక్తమంతా యేమిట్రా? ఏచచ్చినాళ్ళు కొట్టార్రాబాబూ? అయ్యో మన వీరాస్వామేరా!

శివం: ఊ! కొట్టక ముద్దెట్టుకుంటారు. "మీకీ ఊరేగింపులూ మీటింగులూ దేనికంటే వింటారా?" అలాంటి వాళ్ళకు తగిన శాస్తి జరగాల్సిందే!

సూర్యం: మన దేశనాయకుల్నందర్నీ జైళ్ళల్లో బంధించిన ఈ పరప్రభుత్వానికి తప్పులేదుగానీ, మేము మీటింగులూ, ఊరేగింపులూ చేస్తే తప్పేమిటి?

శివం: ఈ యుద్ధకాలంలో యిలాంటి ఉద్యమాలు యేమాత్రం పనికిరావు.

సూర్యం: యెందుకని?

శివం: యెందుకనా?...యెందుకనా?...మన మాస్కో-పార్టీ అలా నిర్ణయించింది గనుక!

సూర్యం: ఎందుకని?

శేషమ్మ: అయ్యో! యిదేమిటారి! ఒకచెంప వాడు ఆయ పాయమంటుంటే, మీరీవాదన యేమిటారి? డాక్టరు కోసం కబురంపారూ?

సూర్యం: [విసుగుతో] మనిషిని పంపించామమ్మా. యింకా రాలేదు, శ్యామలా! త్వరగావెళ్ళి డాక్టర్ని పిలుచుకురా.

శివం: [శ్యామల వెళ్తావుంటే] నేనుకూడా వస్తానుండమ్మా. [శ్యామల, శివం నిష్క్రమణ]

శేషమ్మ: అసలు యెవరు కొట్టార్రా నాయనా?

సూర్యం: ఎవరు కొట్టేదేముంది? మేము ఫ్యాక్టరీ దగ్గర మీటింగ్ చేసుకోబోతుంటే పోలీసువాళ్లు "వద్ద"న్నారు. మేము పోలీసువాళ్ల మాట వినక మీటింగ్ ప్రారంభించాం! వాళ్లు లాఠీచార్జి చేసారు.

శేషమ్మ: పోలీసువాళ్లతో పోట్లాటేమిట్రా నాయనా? వాళ్లు వద్దంటే మానెయ్య రాదూ?

సూర్యం: నీకు తెలియదు గాని ఊరుకో. [దెబ్బతిన్న వాలంటీరు "అమ్మా" అని ఒకవైపునుంచి యింకో వైపుకు తిరుగుతాడు.] ఎలా వుంది వీరాస్వామీ? [వీరాస్వామి మాట్లాడడు. శేషమ్మతో] అమ్మా, కుంపటితో కాసిని వేన్నీళ్లు పెట్టు, తర్వాత కావాల్సి వస్తాయేమో.

[శేషమ్మ లోపలికి వెళ్తుంది, కమల ప్రవేశం]

కమల: ఏమిటి సూర్యం? యివాళ మామిల్లు దగ్గర లాఠీచార్జి జరిగిందటగా?

సూర్యం: అవును, దీంట్లో ఆశ్చర్యమేముంది? యిహాముందు వచ్చే రోజులన్నీ భారతీయులకు చాలా గడ్డురోజులు.

కమల: బొంబాయి, కలకత్తాలో కాల్పులు జరిగినయ్యని యిప్పుడే తెలిసింది.

సూర్యం: ఇంకేం? యీ పాపపు పంట యెంతకాలం పండాలో! మనకు కూడా ఆ పరీక్ష తప్పేటట్లు లేదు.

కమల: నాయకులనందర్నీ, అకస్మాత్తుగా అరెస్టు చేయడం చేత, ప్రజలను యెవ్వరూ ఆపలేకుండా వున్నారు.

సూర్యం: యిది గట్లు తెంచుకొని పారిపోకుండా సక్రమమార్గం లో నడిచేటట్లు చూడాలి.

కమల: రేపు సాయంకాలం గాంధీ మైదానంలో బ్రహ్మాండమైన మీటింగ్ జరుగుతుందట. దాంట్లో మీరు కూడా పాల్గొంటారా ?

సూర్యం: తప్పకుండా ?

కమల: కానీ! మీ మాస్కో-పార్టీ దీనికంతా వ్యతిరేకమని విన్నాను.

సూర్యం: యిహనుంచి మాకూ, మాస్కో-పార్టీకి యేమాత్రం సంబంధం వుండదు. యెవరి దారి వారిదే.

[డాక్టరూ, కామ్రేడ్ శివం, శ్యామలా ప్రవేశం ఒక వాలంటీరు డాక్టరు పెట్టె తీసుకు వస్తాడు. అందరూ లేస్తారు. డాక్టరు గాయాన్ని కాసేపు పరీక్షచేసి, శేషమ్మ తెచ్చిన వేన్నీళ్లతో గాయం కడిగి, మందు గాయంపై వేసి, గాజాదూదీ పెట్టి బాండేజి కడ్తాడు.]

డాక్టరు: [లేవబోతూ సూర్యం వంక చూసి] ప్రమాదమేమీ లేదు. భయపడకండి. తలకొంచెం చిట్లింది. షాక్ వల్ల స్మృతి లేకుండా పడి పోయాడు.

శేషమ్మ: బాబూ, ఏమీ అపాయం లేదంటారా?

డాక్టరు: ఏంఫరవా లేదమ్మా! రెండు మూడు గంటల్లో తెలివి వస్తుంది. [అనిలేచి సైడువింగు వైపు రెండడుగులు వేసి సూర్యంవంక చూసి] నేను మందిస్తాను ఒకమనిషిని పంపించండి. తెలివిరాగానే ఒక డోసు యివ్వండి.

సూర్యం: మరి, మీరీ నాలుగు రోజులూ పొద్దునా సాయం కాలం వస్తూవుండాలి.

డాక్టరు: అలాగే.

[డాక్టరు నిష్క్రమణ]

శివం: యిప్పటి కయినా సమ్మె ఆపుచేసి, పనిలో చేరండి.

సూర్యం: ఆపడానికి వీల్లేదండీ. మా అందరి, ప్రాణాలూ పోయినాసరె ఆవడానికి వీల్లేదండీ!

శివం: నువ్వు అనవసరంగా అధికారాన్ని నెత్తిన వేసుకుంటున్నావ్. మా స్కో-పార్టీ నిబంధనలు తెలియకుండా మాట్లాడు తున్నావ్!

కమల: వాళ్లందరూ కలసి సమ్మె చేస్తానంటే మీ అభ్యంతర మేమిటి?

శివం: సమ్మె చేయడానికి వీల్లేదు. మా పార్టీనాయకుడు ఈ యుద్ధకాలంలో సమ్మెలంటూ వుండవని గవర్నమెంటుకు హామీ యిచ్చాడు. అలాజరిగి తీరాల్సిందే.

సూర్యం: అలాంటి హామీ యెందుకివ్వాల్సి వచ్చింది.

శివం: యిది ప్రజాయుద్ధం గనుక....

కమల: యిది ప్రజాయుద్ధమా ?

శ్యామల: అదిగాదండీ! యీ యుద్ధం ప్రజలే చేస్తున్నారు.... గాడిదలూ, కుక్కలూకావని వారి భావం!

సూర్యం: ఈ దేశంలో ప్రస్తుతం బ్రిటిష్‌వారు సాగిస్తున్నది

కూడా ప్రజాయుద్ధమేనా?

శివం: అదే మన దేశంలో వున్నలోపం. ప్రతిదీ సంకుచిత దృష్టితో చూస్తారు. మన మీా యుద్ధన్ని సరిగ్గా అర్ధం చేసుకోవాలంటే, దానికి నేచెప్పేదేమిటంటే, అంతర్జాతీయ దృష్టి కావాలి.

శ్యామల: అది యెక్కడ దొరుకుతుందండి ?

కమల: రష్యాలో...

శివం: నేను చెప్పేదేమిటంటే "స్వేచ్ఛా" "స్వాతంత్ర్యం" అనేమాటలు యింకా ఈ ప్రపంచంలో వినదలచుకుంటే తప్పకుండా ఈ యుద్ధకాలంలో మనం బ్రిటన్‌కు సహాయం చేయాలి.

సూర్యం: "స్వేచ్ఛా, స్వాతంత్ర్యం" అని చాలా పెద్దమాటలుప యోగిస్తున్నారు. నలభయికోట్ల భారత ప్రజలను బాని సలుగా అణగార్చుడమేనా స్వేచ్ఛకోసం పోరాడటం? ఇటలీ తన పశుబలంతో అబిసీనియాను కబళిస్తుంటే ఈ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలువ"గంగ"లో కలిసినయి. స్పెయిన్, ఆస్ట్రియా, జకోస్లేవికియా, యివినాశనమై పోతూవుంటే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు యేమయినయి? జపానుజలగలాగా చైనాను పీడిస్తుంటే మీా రష్యా, పతిత మానవజాతికి ఆశాకిరణమని పేరువడ్డ మీారష్యా, కొంగజపం చేస్తున్నది దేనికి?

శివం: నేచెప్పేది, మీారు సరిగ్గా అర్ధంచేసుకోవడం లేదు. యీా యుద్ధం అయిపోవడంతోటే ప్రపంచ కార్మిక

శక్తులన్నీ యేకకంఠంతో "యిండియాకు స్వరాజ్యం యివ్వండి" "యిండియాకు స్వరాజ్యం యివ్వండి" అని ఒక ప్రచండమైన ఉద్యమాన్ని సాగిస్తాయి....ఇంకో రహస్యం! బ్రిటన్ యిండియాకు స్వరాజ్యం యివ్వకపోతే మా సోవియట్ ప్రభుత్వం బ్రిటన్ మీద యుద్ధాన్ని ప్రకటించి తీరుతుంది.

శ్యామల: అబ్బా! యిదంతా అంతర్జాతీయ దృష్టితోనే తెలుసుకున్నారూ?

కమల: యింతకాలం ప్రభుత్వం అంటే "కత్తిమాసిన" మీకు యీ అంతులేని ప్రేమ యెక్కణ్ణించి వచ్చిందండి?

శివం: నేచెప్పేదేమిటంటే, పరిస్థితులను బట్టి, పాలసీని మార్చుకోటం మా పార్టీ ఆశయాలలో ఒకటి.

శ్యామల: [శివాన్ని అనుకరిస్తూ] నే చెప్పేదేమిటంటే, యే యెండకా గొడుగు పట్టడం!

శివం: అమ్మాయ్! యిందాకణ్ణించీ చూస్తూన్నాను. రాజకీయాలంటే యేమిటో యెరుగని పసిపిల్లవు. నీ కెందుకీ అనవసరపు మాటలు?

సూర్యం: మీరు వేయిచెప్పండి. లక్షచెప్పండి. మిలిటరీ కంట్రాక్టులతో లక్షలుదోచుకుంటూ కార్మికుల కడుపుగొట్టే ఆ రాధామోహన్ ఫాక్టరీలో, మేము పనిచెయ్యం. చెయ్యం! చెయ్యం!

శివం: అయితే నువ్వు పార్టీ ఆర్డరును లెఖ్ఖ చెయ్యవన్నమాట!

సూర్యం: క్షణక్షణానికి పాలసీ మార్చే పార్టీకూడా ఒక పార్టీయేనా?

శివం: జిల్లాఆఫీసు ఆర్డరుకు నువ్వు యెదురు తిరుగుతున్నావ్!

సూర్యం: తప్పకపోతే యెదురు తిరుగుతాం.

శివం: దాని ఫలితమేమిటో నీకు తెలుసునా?

సూర్యం: నాకా భయం లేదు.

శివం: నీమీద డిసిప్లినరీ యాక్షన్ తీసుకుంటాం!

సూర్యం: తీసుకోండి! ప్రజలను నిర్దాక్షిణ్యంగా గొడ్డును బాదినట్లు బాదిన, యీ ప్రభుత్వంతో, నాకు సంబంధం లేదు. కావాలిస్తే మీరు పోయి కావలించుకోండి.

శివం: అంతర్జాతీయ ప్రఖ్యాతి గాంచిన పార్టీని నువ్వు చులకనగా మాట్లాడుతున్నావ్! దీని ఫలితం అనుభవించకపోవు!

సూర్యం: మీ పార్టీ పేరు, ప్రఖ్యాతులేమిటో యివ్వాడిప్పుడే బయట పడుతున్నాయి మన దేశంలో.

కమల: కార్మికుల్లో ఈ చీలికలు పెట్టడం మీకు న్యాయమేనా?

శివం: మా ప్రిన్సిపల్సు ప్రకారం మేము నడుస్తాం. ఎవరేమయినా సరే. [సూర్యం వంక తిరిగి] నువ్వు సమ్మె ఆపు చెయ్యవన్నమాట?

సూర్యం: నా శక్తివున్నంత వరకూ.

శివం: [లేస్తూ] చూద్దువుగాని నీ శక్తియెంతో నా శక్తియెంతో!

[తెర]

# నా దే శం

## 6 వ రం గ ము

### వీ ధి

[ఒక జాతీయవాదుల వూరేగింపు ముందు శ్యామల, తరువాత కమల, శౌర్యం. యింకా యితర వాలంటీర్లు లోపల నుండి విప్లవగీతం పాడు కుంటూ వస్తారు.]

### పా ట

సత్యచరిత శాంతిదూత
గాంధిబాబు పిలిచెరా
కదలిరమ్ము వీరుడా
కదన భూమికీ ॥స॥
పరులు యిల్లు దోచుచుండ చూచుచుందువా
కదలి రమ్మురా
కదనభూమికీ ॥స॥
ఢిల్లికోట చేరువరకు
జాతిజెండ నెగురువరకు
కత్తి గట్టరా
స్వాతంత్ర భేరి మోగువరకు
ముందుసాగరా

భరత దేశ స్వేచ్ఛ కొరకు
పోరు సల్పరావ!
పోరోచాలో తెలువరకు
రక్త మీయరా...ఓ
భారతీయుడా...ఓ
వీర యువకుడా !!!
॥స॥

కమల: [ఆవేశంతో] భారతీయులారా! లెండు. మన జాతీయ నాయకులందరినీ జైళ్ళల్లో బంధించిన యీ బ్రిటిష్ ప్రభుత్వాన్ని నిర్మూలించటానికి సంసిద్ధులుగండు. గాంధీ మహాత్ముడు మన కందించిన యుద్ధనినాదం, "పోరో చాలో" అన్నమాట మరిచి పోకండి. నాయకులు లేని యీ క్లిష్టసమయంలో, స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించే బాధ్యత మనపై వుంది. యీ పరప్రభుత్వానికి మూల సానమైన ఢిల్లీకోట పట్టుకొనేవరకు మనకు శాంతి లేదు. లెండు! రండు !!

(మరల విప్లవగీతంతో పాట ప్రారంభం)

భారతజాతీ యశోశోభనూ
సర్వలోకములు గుర్తెరుంగురా
శాంతి సమరమూ సాగించుచూ
జయభేరీ మోగించుచూ...

ఢిల్లీ చలో!

ఎగురునదే,
కాంగ్రెసు జెండా
పిలచునదే,
గాంధిమహాత్మ...

...ధీ...ల్లీ...చ...లో...

[శ్రీ "వాణీ ప్రసాద్" గారి అనుమతితో]

[పాట పాడుతూవుండగా స్టేజివెనుక, పోలీసులు వస్తున్నట్లు బూట్ల చప్పుడు వినిపిస్తుంది. పాట సాగుతున్న కొద్దీ, బూట్ల చప్పుడు హెచ్చుతూంటుంది. సార్జంటుయొక్క "హాల్టు" అన్నమాట వినపడుతుంది. శ్యామల వొక్కతే హెచ్చు స్థాయిలో పాడుతూంటుంది. వెంటనే తుపాకీ కాల్పులు వినపడుతయి. శ్యామల హెచ్చుస్థాయిలోవున్న పాటను సడెన్ బ్రేక్ పడి 'అమ్మా' అని డొక్క పట్టుకొని నేలకూలుతుంది. కొంతమంది వాలంటీర్లు చిందర వందరగ పరుగెత్తుతారు. సూర్యం: కమల, శ్యామల దగ్గరకువచ్చి]

సూర్యం: [గద్గదిక స్వరంతో] శ్యామలా! శ్యామలా!!

శ్యామల: [గిలగిలా కొట్టుకుంటూనే] అన్నా... మరచిపోకు... మరచిపోకు... మరచిపోకు.

[అని ఏదో చెప్పబోయి ప్రాణాలు విడుస్తుంది.]

సూర్యం: శ్యామలా! శ్యామలా!! ఒక్కసారి పిలిస్తే పలికే దానవు, ఎన్నిసార్లు పిలిచినా పలుకవేవమ్మా. కమలా! మా అమ్మతో ఏమని చెప్పేది? ఏమని ఆమెముఖం చూడగలను! శ్యామల లేనిది వొక్క క్షణమయినా నిలువలేదే. కమలా! ఆరువేలమైళ్ళ దూరంనుంచి యీ బ్రిటిష్ ప్రభుత్వం మన దేశానికిరావటం, యిలాంటి పసిగందులను చంపటానికేనా?

అసలే, అంధకారంలో, దారిద్ర్యంలో, దుఃఖంలో, మునిగి యున్న మా సంసారాన్ని యింకెవరు, తన అమాయకపు మాటలతో, పాటలతో, మా అభాగ్య జీవితాన్ని వెలిగిస్తారు కమలా! మా అమ్మకు, నాకు మాటబేధం వస్తే యింకెవరు తీరుస్తారు? రోజూ కష్టపడి పనిచేసి యింటికి వస్తే యింకెవరు నన్ను "అన్నయ్యా" అని సంతోషంతో పిలుస్తారు? కమలా!! యింకెవరు నన్ను 'అన్నయ్యా' అని పిలుస్తారు.

[తెర వెనుక నుంచి పాట]

దుఃఖ మేలరా...
చెందెదవూ ..
దీనుడవై పోకురా...
మమతను వీడి
ముందుకు సాగి,
సాగింపరా
పోరాటమూ... స్వాతంత్ర్య పోరాటమూ.
దుఃఖమేలరా?...దుఃఖమేలరా...??
దుఃఖమేలరా ???......

సూర్యం. [వికృతంగా పైకిచూసి] అదిగో! నా చిట్టి తల్లి జీవజ్యోతి అదిగో! యీ స్వాతంత్ర్య పోరాటంలో రాక్షస ప్రభుత్వానికి ప్రథమ బలియైన నా చిట్టితల్లి, నాశ్యామల జీవజ్యోతి అదిగో! అమరగానంతో స్వాతంత్ర వీరులను

కలిసికోడానికి వెళ్తోంది. పదండి. మీరుకూడ పాడుతూ పదండి!

[అని తానే వికృతపు గొంతుతో పాట మొదలు పెడుతాడు]

ఢిల్లీ చలో ! !
సత్యాచరిత...శాంతిమాత
గాంధిబాబు పిలిచెరా
కదిలిరమ్మురా వీరుడా
కదనభూమికీ......

[కాని దుఃఖము అతన్ని ఎక్కువసేపు పాడనివ్వదు. తక్కినవాండ్లు పాట అందుకుంటారు. చచ్చిపోయిన శ్యామలను రెండు చేతులతో ఎత్తుకొని సూర్యం ముందుకు నడుస్తూంటే వాలంటీరు దళం నిష్క్రమిస్తుంది.]

[తెర]



# నా దేశం

## 7 వ రంగము

సూర్యం యిల్లు

[శేషమ్మ మంచంమీద కూర్చొని ఆయాసపడుతూ వుంటుంది. మంచం దగ్గరగా మందుసీసా, సాన, గంధపుచెక్క, వాసం కర్రి, వుంటాయి. శేషమ్మ నొసటిపై గంధం పూయపడి వుంటుంది.]

శేషమ్మ: కమలమ్మా! ఓ కమలమ్మా!!

కమల: [లోపలనుంచి] ఓయ్!

శేషమ్మ: యిటురా అమ్మా.

కమల: [లోపలనుంచి] వస్తున్నా ... [ప్రవేశించి] దేనికీ?

శేషమ్మ: కాశిని మంచినీళ్ళు తెచ్చిపెట్టమ్మా.

కమల: కాచిన పాలున్నయ్, తీసికొచ్చేదీ?

శేషమ్మ: ఎందుకు లేమ్మా! కాశినిమంచినీళ్లు తెచ్చిపెడితేచాలు.

[కమల నిష్క్రమించి మరల పాలగ్లాసుతో ప్రవేశం. గ్లాసులో గల పాలనుచూసి] అయ్యో! పాలే తెచ్చావుటమ్మా. తాగటమే

గాని అరుగుతయ్యా, చస్తయ్యా!

కమల: తాగండీ, కాస్తగుండె దడ తగ్గుతుంది.

శేషమ్మ: ఏం తగ్గుతుందో, యివ్వాళ గుండె వూరికే కొట్టుకు పోతుంది.

కమల: మీరు మాట్లాడకుండా పడుకోండి. అదే తగ్గుతుంది.

శేషమ్మ: నేను పడుకోటాని కేమొచ్చెలే! [కొంచెం లేచి పరుండి] యిదిగో కమలమ్మా! మా అమ్మాయి ఎంతచక్కగా పాడేదను కున్నావ్.

కమల: అవునండి. చాల బాగాపాడేది.

శేషమ్మ: నీవెప్పుడయినా విన్నావాతల్లీ?

కమల: నేను చాలాసార్లు విన్నానండి.

శేషమ్మ: అయితే అమ్మా! యేదీ! మా తల్లి పాడిన పాట వొక్కటిపాడు.

కమల: నోటికిరావండి.

శేషమ్మ: మా అమ్మగా. ఒక్క పాటపాడమ్మా.

కమల: మీరు మాట్లాడకుండా పడుకుంటే తప్పక పాడుతాను. మీరు పడుకోండి.

శేషమ్మ: సరే. అట్లాగే పాడమ్మా.

[కమల పాట పారంభిస్తుంది. శేషమ్మ నిద్రపోతుంది. సూర్యం ప్రవేశం. చినిగిపోయిన చొక్కా, రక్తపు మరకలూ, కడిచేతిని యెడమ చేతితో పట్టుకొని ప్రవేశం. కమల నిర్ఘాంతపోయి చూచి]

కమల: సూర్యం! ఏమిటీ రక్తం?

సూర్యం: ఉస్! మాట్లాడబోకు. వంటింట్లో దూదివుంది తీసు కురా. [కమల లోపలికి వెళ్తుంది] పాతగుడ్డ కూడా [అని శేషమ్మవంక చూసి, ఆమె నిద్రపోతూ వుందని తెలుసు కుంటాడు. కమల పాతగుడ్డా, దూదీ తెచ్చి రక్తం కారుతున్న చేతికి కట్టు కట్ట బోతూ]

కమల: ఏదో కోసుకుపోయి నట్లుందే.

సూర్యం: యిదా, కత్తిదెబ్బలే!

కమల: కత్తిదెబ్బా! యెక్కడ?

సూర్యం: మీ ఫాక్టరీ దగ్గరే!

కమల: ఏం? మళ్లా యేమయినా ఘర్షణ జరిగిందా?

సూర్యం: మీ ఫ్యాక్టరీని యివాళరాత్రి యెలాగయినా నాశనం చేద్దామనుకున్నాను. చీకటి పడింతర్వాత చాటుగా మీ ఫాక్టరీలోకి వెళ్లి డైనమైటు పెట్టి అంటించి వచ్చాను. సరిగ్గానేను కాంపౌండు గోడ దూకుతూ వుంటే కావలా వాడు చూశాడు. నేనూ అతనూ కాసేపు పెనుగులాడాం. చివరకు తన చేకత్తితీసి నన్ను పొడవబోయాడు. అది దూసుకు పోయింది. నేను తప్పించుకొని పారిపోయి వచ్చాను.

కమల: ఆఁ, ఆఁ, ఎందుకు చెప్పు నీకీ అఘాయిత్యపు పనులు. ఫాక్టరీని నాశనం చేయడందేనికి?

సూర్యం: అవి ఫాక్టరీలుకావు. భారత ప్రజలను పీల్చిపిప్పి చేస్తున్న అమానుష మారణయంత్రాలు. మిలిటరీ

కాంట్రాక్టులతో మీ అన్న లక్షలు గుంజడమే కాని, దాని వల్ల కార్మికులకు ఉపయోగమే లేదు గదా! అటువంటి ఫాక్టరీలు వుంటేనేం, లేక పోతేనేం?

కమల: ఫాక్టరీని నాశనం చేసినందువల్ల కలిగిన లాభమేమిటి?

సూర్యం: మీ అన్నగారి ఫాక్టరీలో తయారు చేయబడే ప్రతి వస్తువూ మిలిటరీకి సప్లయి చేయబడుతోంది. అలాంటి ఫాక్టరీలను నాశనం చేసి, మిలిటరీకి నష్టం కలిగించడమే మా ఉద్దేశ్యం.

కమల: మరి, యిహ కూలీలకు జీవనాధారం యెలా?

సూర్యం: జీవనాధారం! ఆ ఒక్క మాటలోనే మన భారత దేశపు దౌర్భాగ్యస్థితి బయట పడుతోంది. కూలీలకు ఫాక్టరీ జీవనాధారం? గుమాస్తాకు ఆఫీసు జీవనాధారం, ప్లీడరుకు కోర్టు జీవనాధారం! యిహ స్వాతంత్ర్యం కోసం పాటుపడేదెవరు? యిలాంటివన్నీ కల్పించే, భారతీయులను బానిసలను చేస్తోంది యీ పరప్రభుత్వం.

కమల: అలాఅయితే ఫాక్టరీకి వెళ్లకుండా వుంటే సరి. దాన్ని నాశనం చేయడం దేనికి?

సూర్యం: అవును, గాంధీ మహాత్ముడు చెప్పింది కూడా అంతే. "కోర్టులు వదలిపెట్టండి. కాలేజీలు వదలిపెట్టండి" కానీ జరిగిందేమిటి! ఏ రోడ్డు చూచినా ప్లీడరు బోర్డులకు ఒక అంతూ పొంతూ లేదు గదా! యిహ కాలేజీలమాట

చెప్పనవసరం లేదుగదా! వందసీట్లుంటే విప్యూయప్లికేషన్లు. మానవ ప్రకృతిని ఒక్క క్షణంలో మార్చలేం!

కమల: మార్చడానికి ప్రయత్నం చేయాలి.

సూర్యం: తప్పకుండా. కానీ మానవ ప్రకృతి మారేంత వరకు స్వరాజ్యం రావడానికి వీల్లేదనడం అర్థం లేనిమాట.

కమల: కానీ నువ్వు చేసేపనుల వల్ల దేశంలో అరాచకం వస్తే?

సూర్యం: రానీ! అరాచకం జరుగకుండా స్వరాజ్యం రావడానికి యిదేం అరచేతి వైకుంఠమా? భారతదేశ దాస్య విముక్తికోసం యెంతమంది తమరక్తాన్ని ధారపొయ్యాలో, యెంతమంది తమ ప్రాణాలను భరత మాతకు అర్పితం చెయ్యాలో!

[సూర్యం మాట్లాడుతూ వున్నప్పుడు, కమల ఆశ్చర్యంతో సైడు వింగ్‌లోకి చూస్తుంది. సూర్యం వెనుదిరిగి చూస్తాడు. కామ్రేడ్ శివం ప్రవేశం, సూర్యం, శివాన్ని చూసి, గాభరాపడి, చేయి వెనుకకు దాచు కుంటాడు.]

శివం: హల్లో! కామ్రేడ్ సూర్యం.

సూర్యం: హల్లో! ఏం, యింత రాత్రివేళ దయచేశారు.

శివం: ఏంచెయ్యమన్నావ్. వెధవపన్లవల్ల యిప్పటికి తీరికయింది. పాపం! మీచెల్లెలు పోయిందటగా.

సూర్యం: అవును. మీరు వూళ్ళో లేరని విన్నానే.

శివం: జిల్లా ఆఫీసులో అర్జెంటు పనుంటే వెళ్ళాల్సివచ్చింది.

నిన్న ఉదయమే వచ్చాను. [పడుకున్న శేషమ్మవంక చూసి] పాపం! మీ అమ్మకూడా కులాసాగా లేదని విన్నాను.

సూర్యం: అదే కులాసా!

శివం: [క్రిందపడ్డ దూదీ, పాతగుడ్డా చూసి] ఆపదమీద ఆపద! [సూర్యం దగ్గరకువచ్చి] యిదిగో సూర్యం! మనం అనేకం అనుకున్నాం. వెధవ పాలిటిక్సు అన్నతర్వాత నే చెప్పే దేమిటంటే యిలాంటి భేదాభిప్రాయాలు వుండక మానవు. ఆఫ్టర్ ఆల్, కార్మికులకు సహాయం చేయడమే గదా మనిద్దరి ఆశయం! మనిద్దరం కలిసి పనిచేస్తే యెంత బాగుంటుందో చూడు.

సూర్యం: అవును. చాలా బాగుంటుంది.

శివం: నే చెప్పే దేమిటంటే, వెనుకటి విషయాలన్నీ మరిచిపో. నేటినుంచీ మనం స్నేహితులం.

సూర్యం: అలాగే.

శివం: సరె నేవెళ్ళొస్తాను. పాపం. మీ అమ్మ జాగ్రత్త! గుడ్ నైట్!

[శివం నిష్క్రమణ.]

కమల: యితను కొంపతీసి నీ సంగతి కనిపెట్టలేదు గదా!

సూర్యం: అదీ నిజమే! నా చేతిపైన గాయం కూడా చూశాడు. నేను యిక్కడ వుండటం మంచిది కాదనుకుంటాను.

కమల: ఈ కాంగ్రేసువాల పట్టుదల నీకు తెలియదు. వేటకుక్కలు కూడా వీళ్ళకంటే నయం. నువ్వు చాలా జాగ్రత్తగా వుండాలి. యేమాత్రం కూడా వాళ్ళకు నీ ఆచోకీ తెలియనీయకూడదు. [సూర్యం తల్లివంక చూస్తూవుంటాడు] మీ అమ్మ విషయం భయపడ బోకు. నేను జాగ్రత్తగా చూస్తూ వుంటాను.

సూర్యం: [హడావుడిగా] సరె, నేను వెళ్ళొస్తాను కమలా!

కమల: ఎక్కడ దాక్కుంటావ్?

సూర్యం: యింతవరకూ యెక్కడా అనుకోలేదు. నీకు తర్వాత తెలియ పరుస్తానులే.

కమల: [సూర్యం వెళ్తూవుంటే] జాగర్త!

[సూర్యం నిష్క్రమణ]

[తెర]



# నా దేశం

## 8 వ రంగము

---

రాధా మోహన్ యిల్లు

[రాధామోహన్, సర్కిల్ యిన్స్పెక్టర్. రాధామోహన్ సిగిరెటు ముట్టించి యిటూ అటూ పచారుచేస్తూ వుంటాడు. సర్కిల్ యిన్స్పెక్టరు కుర్చీలో కూచొని, సిగిరెటు కాలుస్తూ పై కప్పువంక చూస్తూ వుంటాడు]

రాధామో: ఎంతపని జరిగిందీ! పదిలక్షల ఫాక్టరీ ఒక్క క్షణంలో ధ్వంసమయి పోయిందే! యీ గూండా యెవరో ఆచోకీ పట్టకపోతే లాభం లేదండీ!

సర్కిల్: అదే ఆలోచిస్తున్నానండీ. ఫాక్టరీని డైనమైటుపెట్టి పేల్చడం. కాపలావాడికి చిక్కకుండా పారిపోవడం. ఆ! యిదంతా చూస్తే వీడెవడో చాలా అసాధ్యుడుగా వున్నాడే! పోనీ, ఆ కాపలావాడయినా యేదన్నా యిన్ఫర్మేషన్ యిస్తాడేమోనంటే నాకేం తెలియదని యేడవడం తప్పితే రెండో ముక్క వాడి నోటినుంచి రాదాయె! అందుకనే అనుమానంగా వున్నవాళ్ళను స్టేషన్కు తీసికు రావలసిందని ఆర్డరు వేశాను [నోటుబుక్కు, పెన్సిల్ తీస్తూ] మీకు అనుమానంగా వున్న మనుష్యు లెవరైనా వున్నారా?

రాధామో: ఏమిటో, అంతా అయోమయంగా వున్నదండీ. నాకేం తోచడంలేదు. పదిలక్షల ఆస్తి! బూడిదపాలయింది.

సర్కిల్: ఆ స్త్రీమాట దేవుడెరుగు. మీ కనుమానం యెవరి పైనన్నా వుంటే చెప్పండి. [రాసుకోబోతూ] మీ విరోధులు?

రాధామో: [కటకారంగా] పన్నెండువందలు మాత్రమే.

సర్కిల్: పన్నెండు వందలే!

రాధామో: అవునండీ, మా ఫాక్టరీలో పనిచేసే వాళ్లంతా మా విరోధులే! పేర్లు కావాలిస్తే మా హెడ్ గుమాస్తా నడగండి.

సర్కిల్: [నోటుబుక్కూ, పెన్సిలూ టేబిల్ మీద కొడుతూ] నేను వేళాకోళానికీ, నవ్వులాటకూ మీ యింటికి రాలేదు.

రాధామో: పదిలక్షల ఫాక్టరీ దగ్ధమైపోతూ వుంటే వేళా కోళాలేమిటండీ.

సర్కిల్: అయామ్‌సారీ! మీరు సరిగ్గా ఆలోచించే పరిస్థితుల్లో లేరు. [లేచి] నేను మళ్లీ వుదయం వస్తాను.

రాధామో: మీ యిష్టం, యెప్పుడొచ్చినా సరే.

[సర్కిల్ వెళ్లబోతుంటే శివం ప్రవేశం]

శివం: వన్ మినిట్ సర్! వన్ మినిట్! యింపార్టెంటు న్యూస్! మీ ఫాక్టరీ తగలబెట్టింది, యెవరో తెలుసా?

రాధామో: } ఎవరు ?
సర్కిల్: }

శివం: ఒక్కమాట వూచీయిస్తే చెప్తాను.

రాధామో: ఏమిటా వూచీ?

సర్కిల్: దబ్బున చెప్పవయ్యా.

శివం: నా పేరు బయట పెట్టకుండా వుంటారా ?

సర్కిల్: అసలు నీ పే రేమిటో మాకు తెలిస్తేగా !

రాధామో: ఈయన యీ జిల్లా లేబర్ ఆర్గనైజరు, కామ్రేడ్ శివం అంటారు.

శివం: మరి నా పేరు ఏ పరిస్థితుల్లో నయినా బయట పెట్ట కూడదు.

రాధామో: అలాగే.

శివం: మీరండీ?

సర్కిల్ : అలాగేనయ్యా.

శివం: మీ ఫాక్టరీ తగలబెట్టింది, [అటూ యిటూ చూసి] సూర్యం.

రాధామో: } సూర్యం!
సర్కిల్: }

సర్కిల్: ఎవరండీ, యీ సూర్యం?

[సైండువింగ్‌లో కమల ప్రవేశం]

రాధామో: మా ఫాక్టరీలో పనిచేసే ఒక కూలి.

శివం: మరి మీరు తొందరగా వెళ్ళకపోతే లాభంలేదు. అప్పటికే నన్ను చూచికొంత అనుమానించాడు.

రాధామో: అతనియింటి నుంచేనా నువ్వు రావడం.

శివం: అవును. మీ చెల్లెలుకూడా అక్కడేవుంది.

రాధామో: చావనీ. దానివల్లే మాకొంపయిలా తగలడుతోంది. [కమలనుచూసి, నిర్ఘాంతపోయి] కమలా!
[సర్కిల్, శివం కమలపైపు తిరుగుతారు.]

కమల: [ముందుకువస్తూ] ఊఁ! కానీ ... ఆవేశావేం?

రాధామో: యిన్స్పెక్టరుగారూ, పదండి. మాచెల్లెలుమాటలకేంగానీ. అది యెప్పుడూ వున్నదేమాకు. మనం ఆలస్యం చేశామంటే పిట్ట తప్పించుకుపోతుంది.

కమల: [నవ్వుతూ] వెళ్లండి. దొంగలువడ్డ ఆరునెల్లకు కుక్కలు మొరిగాయుట. [సర్కిల్ యిన్స్పెక్టరూ, రాధా మోహన్ నిష్క్రమణ. కామ్రేడ్ శివంకూడా కదుల్తూవుంటే] కామ్రేడ్ శివం! ఒక్కమాట !

శివం: [భయపడుతూ వెనుదిరిగి] పదిలక్షల ఫాక్టరీ తగలపడిపోయిందంటే, మీ కెలావుందో గాని, నాగుండె మట్టుకు తరుక్కు పోతోంది.

కమల: అహా ! ఏమి సానుభూతండీ, యిదంతా అంతర్జాతీయ సానుభూతా ?

శివం: అవునులెండి, బీదల కష్టాలు తమలాంటి వారికెలా తెలుస్తాయి! రేపటి నుంచీ ఆరువందల కుటుంబాలు "అలో లక్ష్మణా" అంటూ అల్లాడి పోతాయి.

కమల: అహాహా ! [వంగి నమస్కరిస్తూ] తమ అతి తెలివికి నా అభివందనాలు! ఎందుకండీ, తమకీ తెరచాటు నాటకాలు, మనిషి దగ్గర మనిషి మాటా !

శివం: [తెల్లబోతూ, కాని అది కనబడ నీయకుండా] మై స్టాలిన్ గ్రాడ్! మీరు చెపుతున్నదేమీ నా కర్థం కావడం లేదు. అనవసరంగా నామీద నిందలు మోపుతున్నారు, నేనేం చేశానూ?

కమల. ఇంకేం చెయ్యాలి? పిల్లిపాలు తాగుతూ తన్నెవరూ చూడలేదను కుందట. సూర్యం తమకేం ద్రోహం చేశాడనీ. అతన్ని యెందుకిలా పోలీసులకు పట్టివ్వడం.

శివం: మై స్టాలిన్ గ్రాడ్! యిదేమిటండోయ్! ఈపాపమంతా నామీద వేడుతున్నారు! యింకా యేదో ఫాక్టరీ తగలడ్డ విషయం, యీ ఆరువందల కుటుంబాలను ఎలాగా పోషించడం, యీ విషయాలు మీ అన్నగారితో మాట్లాడుదామని వస్తే, బాగానేవుందే! కార్మికులకు సహాయం చేయుడమే మా విద్యుక్త ధర్మమన్న విషయం మీరు మరిచారు!

కమల: సహాయం! అభిప్రాయ బేధాలున్నంత మాత్రాన దేశభక్తులను ప్రభుత్వానికి అప్పగించడమేనా మీరు చేస్తున్న సహాయం! ప్రజలలో రేకెత్తుతున్న విప్లవజ్వాలలను అణగార్చడమేనా మీరుచేస్తున్న సహాయం! ప్రపంచ యుద్ధాన్ని, మన స్వాతంత్ర్య పోరాటానికి బానటగా చేసుకోలేక, ప్రజాయుద్ధమనీ, యెక్కడో నిరంకుశశక్తుల నిర్మూలనం కావాలనీ యీ మొసలి కన్నీరు దేనికి? మాసొంత మానసిక దాస్యంలో, నీ దేశంలో, నీఊరిలో

నీయెట్ట యెదుట జరుగుతున్న ఫాసిస్టు భీకర నృత్యం చూడలేక పోతున్నావ్!

శివం: [లేస్తూ] అన్యాయం! అన్యాయం! మా పార్టీని నాశనం చేయడానికి యివి మీరు పుట్టించే నీలాపనిందలు. నాకు తెలుసు! నాకు తెలుసు!! మీరంతా ఆ దేశ ద్రోహి బోస్ యేజెంట్లు! మీరంతా అతని పంచమాంగ దళం! నాకు తెలుసు! నాకు తెలుసు!! మై స్టాలిన్‌గ్రాడ్!!!

[శివం నిష్క్రమణ]

కమల: [వెక్కిరిస్తూ] మైస్టాలిన్‌గ్రాడ్!

[తెర]



# నా దేశం

## 9. వరంగము



రాధా మోహన్ యిల్లు

[భానుమూర్తి పేపరు చదువుకుంటూ వుంటాడు]

భాను: నాశనం! సర్వనాశనం! [అటూయిటూ చూసి] అప్పడూ! అరే అప్పుడూ !

[హడావుడిగా అప్పడు ప్రవేశం]

అప్పడు: ఏంటండి బాబయ్య ?

భాను: యింకా "యేంటండీ బాబయ్యా" యేంట్రా, దేశ మంతా నాశనమై పోతుంటే.

అప్పడు: నిజంగానే బాబయ్యా.

భాను: ఎక్కడ బడితే అక్కడ మంటలు లేచిపోతున్నయి.

అప్పడు: వర్సాకాలం వచ్చింతర్వాత కూడా మంట లేందండి బాబయ్యా !

భాను: యివి ఆ మంటలుకాదురా. వీటిని ఆగష్టు మంట లంటారురా.

అప్పడు: ఓహో యివో కొత్తరకం మంటలు కామోసు.

భాను: రైలు స్టేషన్లు తగలడి పోతున్నాయి ! టెలిగ్రాఫ్

తీగెలు తెగిపోతున్నాయి ! కోర్టులు కొట్టుకు పోతున్నాయి! రైళ్లు పడిపోతున్నాయి ! ఒకటేమిటాకి, అన్నీ !

అప్పడు: అయ్యబాబోయ్! యిదంతా సొరాజ్యం కోసమే!

భాను: వాళ్ళసుఖంకోసం! బుద్ధిలేక పోతేసరి.

అప్పడు: అయితే ఎందుకు బాబయ్య, యిదంతా సెయ్యటం.

భాను: ఎందుకా? తినికూచోలేక! గవర్నమెంటును యెదిరిస్తే వీళ్ళకసలు పుట్టగతు లున్నాయిట్రా.

అప్పడు: అంతేబాబయ్యా! "రాజు దలసుకుంటే దెబ్బలకు కొదవా" అన్నారు.

భాను: ఏదో, గవర్నమెంటును బతిమాలి, బామాలి, "మీయంత వాళ్లులేరు. మీరే ప్రభువులు" అంటే పని సాగుతుందిగానీ.

అప్పడు: లేకపోతే అడుక్కు తినాల్సిందేనండి.

భాను: మంచి మాటన్నావు. అదిగాదురా, నువ్వు మాదగ్గర పనిచేస్తున్నావుగదా. నీకోరూపాయి కావాలనుకో, అప్పుడు నువ్వేం చేస్తావో చెప్పు.

అప్పడు: నేనుండి బాబయ్య. బతిమాల్తాను, కాళ్ళమీద పడతాను. దమ్మపబువు లంటాను. రూపాయికి సేయిసాత్తే పది రూపాయిలిచ్చే మాందాతలంటాను.

భాను: అదీ, అట్లవుండాలి. అంతేగానీ "యిస్తావా, చస్తావా, లేకపోతే నీయిల్లు తగలెడతాం" అంటే యెవడైనా

రూపాయికాదు. దమ్మిడీ యిస్తాడ్రా! అంపులో రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం! మాటలు్రా!

అప్పడు: అయితే బాబయ్యా! మనం యెంత బతిమాలినా సొరాజ్యం యియ్యడనుకోండి. అప్పుడేం సెయ్యాలి?

భాను: యింకా బతిమాలాలి! ఇందుడ్రవూ, చంద్రుడవూ అనాలి. ఎట్టాగయినా వాడి మనసు కరిగించాలి?

అప్పడు: ఆడికి మనసు కరగడం అలవాటు లేదనుకోండి. అప్పుడో?

భాను: [విసుగుతో] యింకా బతిమాలాలి.

అప్పడు: అప్పటికీ సొరాజ్యం యియ్యకపోతే?

భాను: [కోపంతో] అరేయి, అప్పడూ! యీ మధ్య నీ వొళ్ళు బాగా పొగరెక్కినట్లుంది. ఆ వెధవ కాంగ్రెసు మీటింగులకు వెళ్ళొద్దని నీ కనేకసార్లు చెప్పాను. వెధవ చొప్పదంటు ప్రశ్నలువెయ్యక నే చెప్పిన మాటలునమ్ము. బతిమాలగా బతిమాలగా చివరకు రాయైనా కరుగుతుంది.

అప్పడు: తెల్లాడి గుండె రాయికన్నా గట్టింటండి.

భాను: [మరీకోపంతో] అదుగో మళ్ళీ మొదలు పెట్టావ్! వెధవ్వి! యింగితజ్ఞానం లేకపోతేసరి. వెర్రినమాధానాలూ, నువ్వూ! జాగ్రత్త!

అప్పడు: [గడగడ లాడుతూ] చమించాలి, పబువులు, పబువులు, తమపాద దాసుణ్ణి, తప్పుసేసాను, చమించాలి బాబయ్యా!

[అని చెంపలు వాయించు కుంటాడు]

భాను: యిహ ముందెప్పుడూ అలాంటి కుంటి ప్రశ్నలు వేయకు. తెలిసిందా?

అప్పడు: సిత్తం బాబయ్యా! దర్మప్రభువులు! ఒకరూపాయికి సేయిసాత్తే పదిరూపాయిలిస్సే మాందాతలు.

భాను: [జేబులోనుంచి ఒక చుట్టతీసి] వద్చావులే! పో, ప్రస్తుతానికి యీ చుట్టతీసుకో!

అప్పడు: పభువులు! పభువులు! [చుట్టతీసుకొని] తమ కటాచ్చం వుండాలిగానీ యిదే పదేలు బాబయ్యా!

భాను: చూశావురా! నేనెలా కరిగిపోయానో. యింతేనురా. నీయంతవాడు లేడను. బ్రిటిష్‌వాడు, యిట్టేకరిగి పోతాడు.

అప్పడు: అంతేనుండి! అచ్చంగా అంతేనుండి. పది రూపాయిలు యిత్తా, యిత్తానంటాడు గానీ, ఆతెల్లోడు కూడా సివరకు సేతిలోయెట్టేది సుట్టపీకే నుండి! అంతేనుండి! అంతేనుండి!

[అంటూవుండగా రాధా మోహన్ ప్రవేశము అప్పడు వెనక్కు వెనక్కు తగ్గి నిష్క్రమణ]

రాధామో: ఇంకా కమల రాలేదుగా?

భాను: రాలేదుమరి! ఇల్లువదిలి యివ్వాల్టికి సరిగ్గా మూడు రోజులైంది.

రాధామో: అయినా దీని కంతటికీ మీరే కారణం!

భాను: బాగానేవుంది. నేనేం చేశాను?

రాధామో: ఇంకేం చేయాలి? దాన్ని యిష్ట మొచ్చినట్లు తిరగనిచ్చారు, చాలదూ?

భాను: మహాభేషుగ్గావుంది. నేనేం దాన్ని బజార్లు పట్టుకు తిరగమన్నానా?

రాధామో: మన పేరూ ప్రతిష్ఠా కించిత్తైనా ఆలోచించక పోతే ఎలా? ఇంట్లోవుండే వారు గనుక మీకేమీ తెలియడంలేదు. సొసైటీలో తిరగడం ఎంత తలవంపులుగా వుందో నాకు తెలుసు.

భాను: అవును. నాయనా! ఏంచేస్తాం? శతవిధాలా ప్రయత్నించాం. ఇది నీకు మంచిది కాదమ్మా! అని చెప్పాం. వినలేదు. అయినా ఈకాలంలో ఒకరు చెప్పడం, మరొకరు వినడం కూడానా? ఎవరికివారే యమునాతీరే...

రాధామో: అలా వీలులేదండి. ఈతఫా అటోయిటో తేలిపోవాలి.

భాను: అంటే?

రాధామో: ఈ యింట్లో అదినేను చెప్పినట్లు వుండటమో, లేకపోతే బయటికి నడవడమో!

భాను: ఏదో! అదీ చదువుకున్నపిల్ల. దాని యిష్టం. మనకు ఎందుకు?

రాధామో: "దాని యిష్టం దానిది. మనకెందుకు" అనుకోబట్టే, మన కర్మ యిట్లా కాలింది. లేకపోతే మన ఫ్యాక్టరీ తగలబెట్టిన ఆ సూర్యంగాడితో దీనికి స్నేహమేమిటి, చెప్పండి?

భాను: అదేరా! బాబూ! నేను రోజూ మొత్తుకుంటున్నది. నామాట వినందే?

రాధామో: వినకపోతే ఏం చేయాలి? (భానుమూర్తి సమాధానం చెప్పలేక వూరుకుంటాడు) ఏం? మాట్లాడరేం?

భాను: నన్నేం చెప్పమంటావ్? ఆమాటకు వస్తే నిన్ను ఎదిరించి మేలు చేయగలిగింది ఏమీ లేదుగద!

రాధామో: అది యీ యింట్లో వుండదలుచుకుంటే, మనం చెప్పినట్లు నడవాలి. లేకపోతే దానిదారి అది చూచుకోవాల్సిందే.

భాను: నాకు ఒక్కగాను ఒక్క కూతురు. నీకు ఒక్కగాను ఒక్క చెల్లెలు. దాన్ని వెళ్ళగొడ్తానంటావేమిటా?

రాధామో: మీరిలా దయ తలచడం నాకేమాత్రం యిష్టం లేదు. ఇప్పటికే మనపేరు ప్రతిష్ఠలు బూడిదపాలయినాయి. "నీ చెల్లెలు కాంగ్రెసు మీటింగుల్లో పాల్గొంటోంది గనక నీకు యిహముందేమీ, మిలిటరీ కాంట్రాక్టులు యివ్వము" అని గవర్నమెంటువారు మొన్ననే తెలియజేశారు. దానివల్ల మన బిజినెస్‌కు ఎంత నష్టమో మీరే ఆలోచించండి.

భాను: బాబూ! నీ యిష్టం. అది రాంగానే మళ్ళీ ఒకసారి చెప్పి చూద్దాం. వింటుందా బాగుపడుతుంది. లేకపోతే దానికర్మ అంతే అనుకుంటాం!

[కమల ప్రవేశము క్షణం నిశ్శబ్దం ]

అమ్మాయి! నువ్వు యీ మూడురోజుల నుంచీ ఎక్కడున్నట్టు?

కమల: దేనికీ?

భాను: ఊరికే తెలుసుకోవాలని అడుగుతున్నాను.

కమల: సూర్యం యింట్లో వున్నాను.

రాధామో: మన ఫ్యాక్టరీలో కూలీగా పనిచేసినవా డింట్లో నేనా?

కమల: అవును.

భాను: అయితే పెండ్లి కాని పిల్లవు. ఒకరి ఆధీనంలో వున్న దానవు. మాతో చెప్పకుండా పరాయివాడింట్లో వుండటం నీకు మంచిదేనా?

కమల: నే నేమీ తప్పుపని చేయలేదే?

రాధామో: అయితే, నీ వీ మూడురోజులు ఆ సూర్యం యింట్లో చేస్తూన్న పని ఏమిటి?

కమల: తమకు చెప్పాలా?

భాను: అవునమ్మా చెప్పాల్సిందే. మనమంచీ, చెడ్డా యిప్పటి వరకూ వాడే చూస్తున్నాడు. వాడేమన్నా అడిగితే మనం సమాధానం చెప్పాల్సిందే!

కమల: సూర్యం తల్లికి జబ్బుగావుంటే సపర్య చేస్తున్నాను.

రాధామో: కూలీల తల్లులకూ, పెండ్లాలకూ సపర్య చేయడమే
నీ పని అన్నమాట!
కమల: అవును. దాంట్లో తప్పేముంది?
రాధామో: మన ఫ్యాక్టరీ తగలబెట్టిన ఆ నీచుని యింట్లో
కాలు బెట్టడానికి నీకేమంత కర్మ మొచ్చింది?
కమల: మన ఫ్యాక్టరీ! నీ ఫ్యాక్టరీలు, నీ సౌధాలు, కూలీల
రక్తమాంసాలు పిండి, మీరు చేసిన ఘోరకార్యాల
చిహ్నాలు. వాటిని నాశనంచేస్తేనే సకలమానవ లోకానికి
శాంతి కలుగుతుంది.
భాను: అమ్మాయి! ఈడువచ్చిన పిల్లవు. నీ కింత ఆవేశం
పనికిరాదు ఏదో కొన్నాళ్లు అన్నయ్య చెప్పినట్లు విని
కమల:లం వెళ్ళబుచ్చావంటే, తర్వాత నీవూ ఒకయింటి
వుండవి అయిపోతావు. అప్పుడు, ఎవరియిష్టాలు వారివి.
అవి షా: కూలీలను పూసుకొని తిరిగే యీ మహాతల్లికి.
భాను: ఓ అయ్యో అదృష్టం కూడానా? ఏనాడు ఆ సూర్యం
కమల: నాయింటికి దాపురించాడో, ఆనాడే మన మర్యాద
విముక్తియింది. ప్రపంచమంతా అదే ఘోష అయి
నాకు ఇయిక తలెత్తుకుని బ్రతికేదెట్లా?
మీ ఆశీ గురించి నీవేమీ బాధపడవలసిన అవసరం
భాను: మీ కన్న వేయిరెట్లు ఆ కూలీలే నయం. వాళ్లకు
ల్సింది. నయుంది. సూర్యం లాంటి విప్లవవీరుల పాద
ఈ పాటికి నుంచుకోడానికి కూడా తగని హృదయం లేని
మనకు ఏ కావు!

రాధామో: కమలా! శ్రుతిమించుతోంది. శతృవులతో చేతులు కలిపి కన్నవాళ్ళకే ఎసరు పెడుతున్నావ్! నీవు యీ యింట్లో వుండదలుచుకుంటే, మేము చెప్పినట్లు నడవాలి. తెలిసిందా?

కమల: ఆ విషయం నీవు చెప్పనక్కర్లేదు. నా ఆశయాలకోసం, ఎంతటి కష్టాన్నైనా ఎదుర్కొంటాను.

రాధామో: అయితే, యిహ నీవు ఆ కూలీలను పురాసుకు తిరగడం మానవన్నమాట!

కమల: దాంట్లో నాకేమీ తప్పు కన్పించడం లేదు.

రాధామో: నా ఫ్యాక్టరీ తగులబెట్టిన ఆ సూర్యంగాడి స్నేహం మానమని నీకనేకసార్లు చెప్పాను. నా వున్న డింట్లో వినదల్చుకున్నావా? లేదా?

కమల: నా ప్రాణం పోయినా సరే. ఈ విషయంలో వినలేను. వి...న...ను.

రాధామో: చిన్నప్పటి నుంచీ పెంచి పెద్దనుచేసిన ఈ సూర్యం నాకూ, నీవు చెప్పేసమాధానం యిదేనన్న! కాలమో ఓపికపట్టాం! నీకు నడవడి నానాటికి రాగాన పడుతోంది. నీకుయింకోసారి అవకాశం యిస్తున్నా డా యిప్పటి మేము చెప్పినట్లు నడుచుకోడానికి అడిగితే వుండు. లేకపోతే బయటికి నడు.

కమల: నాకు ఏదిమంచిదనితోస్తే అది తప్పక చేస్తున్నాను. ఎవరేమనుకున్నా సరే!

రాధామో: అయితే ఈ క్షణంనుంచి నీకు ఈ యింట్లో స్థానం లేదు. గెట్ అవుట్ [రాధామోహన్ నిష్క్రమణ]

కమల: [తలవంచుకొని దుఃఖిస్తూన్న తండ్రిని సమీపిస్తూ] వెళ్ళొస్తాను. నాన్నా!

భాను: ఎక్కడికి వెళ్తావమ్మా?

కమల: ఈ విశాల ప్రపంచంలో నాకు వుండటానికే చోటు లేదా? నాన్నా!

భాను: అమ్మాయి! వాడేదో కోపమొచ్చి మాట్లాడితే నీవలా గట్టిపట్టు పట్టితే ఎలా చెప్పు? ఈ మూడు రోజులమట్టీ "కమలఏదీ?- కమలఏదీ?" అని వాడు కలవరించని క్షణం లేదు. వాడికిమట్టుకు నీ మీద ప్రేమ లేదుటమ్మా!

కమల: నాన్నా! ఇహ ఒక్కక్షణంకూడ నేను యీ యింట్లో వుండలేను. మా మార్గాలు వేరు. మా ఆశయాలు వేరు. అవి ఫలించాలంటే మేము విడిపోవాలి.

భాను: చిన్నదానవు. ఎక్కడుంటావమ్మా?

కమల: నాకాభయం లేదు. నాన్నా! దేశమాత దాస్య విముక్తికోసం పోరాడే సోదరులు చాలామంది వున్నారు. నాకు ఆశ్రయమిచ్చే పవిత్రగృహాలు చాలా వున్నాయి. మీ ఆశీస్సులే నాకు పదివేలు.

భాను: మీ యిద్దరూ సుఖంగా వుండటమే నాకు కావాల్సింది. నా మాటవిను. అమ్మా! అన్నయ్య కోపం రేపు ఈ పాటికి చల్లారిపోతుంది. వాణ్ణి ఆశ్రయించుకొని వుంటే మనకు ఏ కష్టాలూ వుండవు.

కమల: ఆశ్రయంకోసం ఆశయాలు వదలుకుంటామా? నాన్నా!

భాను: ఇంత పెద్దవయస్సులో, మీరిద్దరూ విడిపోవడం నాకు ఎంత కష్టమో నీవు ఆలోచించావా? తల్లీ!

కమల: నాన్నా! మే మిద్దరం కలిసివుండి నిన్ను సుఖపెడుతున్నాం గనక, విడిపోయి కష్టపెడతామా?

భాను: అయితే నీతోపాటు నేనుకూడా వస్తానమ్మా!

కమల: వద్దు. నాన్నా! అన్నయ్య దగ్గర వుంటే నీకు ఏ లోటూ వుండదు. నేను అప్పుడప్పుడు వస్తూ పోతూ వుంటాను. నీవేమీ దిగులు పెట్టుకోకు నాన్నా!

భాను: అమ్మా! నీవు ఎక్కడున్నా నా హృదయం మట్టుకు ఎప్పుడూ నీ దగ్గరే వుంటుంది. తల్లీ!

కమల: వెళ్ళొస్తాను. నాన్నా! [అని నమస్కరిస్తుంది.]

భాను: [ఆశీర్వదిస్తూ] రేపో మాపో అంటూన్న యీ ముసలి ఘటాన్ని మరచిపోకు. తల్లీ!

[కమల నిష్క్రమణ]

[తెర]



# నా దేశం

## 10 వ రంగము

### వీధి

[జాతీయవాది మరికొందరువలంటీర్లు ప్రవేశం]

పాట :

భారతీయ యువకుడా
సాగిరార ముందుకూ
స్వాతంత్ర్యసిద్ధికై
త్వరపడరా సోదరా ॥భార॥

కత్తికత్తి కలుపుచూ
చేయిచేయి కలుపుచూ
జాతీయ సైన్యంలో
చేరరా సోదరా ॥భార॥

గాంధీ, నెహ్రూలా
అడుగుజాడ మెలగరా
వారే మనజాతీయ
నాయకులురా
భారతీయ యువకుడా
సాగిరార ముందుకూ

[విద్యాసాగర్ అనుమతితో]

[వాలంటీర్ల పాటపూర్తి కాగానే లోపలినుండి.]

సూర్యం: దేషమంటే మట్టిరోయ్, షోదరా
దేషమంటే మట్టిరోయ్...

[సూర్యం ముస్లిం వేషంతో ప్రవేశించి వాలంటీర్లకు మట్టిని ప్రసాదము వలె యిచ్చును.]

1 వాలంటీర్: యిదేమిటోయ్ సాయిబూ. మట్టి చేతులో పెట్టి "దేశమంటే మట్టిరోయ్" అంటావేమిటి? యీ మట్టి యేమిచేసికోను. నెత్తిన కొట్టుకోమా!

సూర్యం: అరే, నీకీ తిన్నహాన్నం హెక్కణ్ణించి వస్సిందీ భాయ్?

1. వ, హాలంటీర్: బియ్యంలో నుంచి వచ్చింది.

సూర్యం: ఆ భియ్యం?

2 వ, వాలంటీర్: వడ్లలోనుంచి.

సూర్యం: ఆ వఢ్లూ?

2 వ, వాలంటీర్: వరి కంకిలో నుంచి.

సూర్యం: అరే! హా కంకీ!

1 వ, వాలంటీర్: ఆ: ఆ: మన్నులో నుంచి.

సూర్యం: హైసాబోలో! నీకి తిన్నా హన్నంకీ మన్ను. నీకీ కట్టె ఖఫడాకీ మన్ను. హంతా మన్ను ..హారే! మాకీ మంసీ మాంసీ ఖుదా హక్కీ సెప్తాన్ హింటారూ భాయ్!

1 వ, వాలంటీర్: ఓ, తప్పకుండావింటాము. చెప్పు సాయిబూ.

సూర్యం: బైఠో! బైఠో!! మాకీ తాతా హూ క దూ

హుండేవాడ్. ఆడ్కి ముగ్గుర్ కొడుక్కుల్. హొకడు హిందీమతం, హొకడు తుర్కామతం, మూఢో వాడ్కి కిరస్తానీ మతం.

1 వ, వాలంటీర్: యిదేమిటోయ్ సాయిబూ. మీ తాతకు మూడు మతాల్లోనూ ఎలా పుట్టారోయ్?

సూర్యం: హారే! నీకీ హేం తెల్సు ఘోంగూరా? మా తాతకీ హిందీమతం. ఒఖ ఖొడుక్కా హిందీమతంలో హున్నాడ్. యింఖోడ్ తుర్కామతం తీసికున్నాడ్. మూడో వాడ్కి కిరస్తానీమతం తీసికున్నాడ్.

1 వ, వాలంటీర్: ఓ! అదా మొదట ముగ్గురు హిందువులే అన్నమాట!

సూర్యం: హైసాబోలో! మా తాతాకీ హింటీనిండా మనూ్నా వుందీ. మనూ్నా... హప్పుడ్ హెంతామనూ్నా వుంటే అంతా ధనం. హొకరోజున మాహూర్కి ఒక తెల్లాపాహుకార్ వస్సినాడ్... వస్సీ, మా తాత్కి సూసి హార్రే, తాతా, తాతా, నా దగ్గరా మంసీ, మంసీ లడ్డూకీ హుంది. తింటావూభాయ్ అన్నాడ్. మా తాతాకీ తినాడ్, మాకీతిన్నాం. హారేయ్! హాడ్కి తింటే హేం జరిగింది భాయ్! మత్తూవస్సీ మా తాత ఫడినాడ్. మాకీ పడినాం. హా మత్తూ, మత్తూ వంద హేండ్లూ వుండిందీ భాయ్.

1 వాలంటీర్: వందఏండ్ల మత్తే!

**సూర్యం:** మరి హేంటీ హనుకున్నావ్ ! వందా హేండ్లకీ మాకీ లేసీ నూసుకున్నాం. హారే హెక్కా సూశ్నా ఆ నూ్న హాంది లేద్. మాకీ హంతా ఘూల్లూ, ఘూల్లూ మన్నామ్. హేమిసేస్తాం. హెతికార్ ! హెతికార్ ! హెక్కామన్నూ హాంది లేద్ ! హప్డూ హానుకున్నార్. హారే హా తెల్లాపాహుకార్ మక్కీ లడ్డూకీ తిసిపింసీ మట్టీ కొట్టేసినాడ్ ! హాణ్ణీ పట్టుకోవాలీ హాని పంతం పట్టార్ !

**2 వాలం:** వాడెక్కడున్నాడు?

**సూర్యం:** వాడు హిడ్డా హక్కా కాదూ ! హేరు వేలామైల్లా ధూరంలో హున్నాడ్. హారణ్యాల్ దాటాం, సముద్రాల్ దాటాం, పోయీ, పోయీ వాడూ హున్నా హింటీకీ పోయినామ్ వాడీ హింటీసుట్టూ సముద్రం, హప్పుడ్ మాంతా తాహన్నాడ్ "హారె తెల్లాయెద్వా ! మాకీ బోల్లాకొట్టేసి నీకీ మన్నుకొట్టేసినావ్, మాదీ మన్నూ మాకీ యిస్సేయి: నైతోనీదీ బుర్రాకీ రామ్ రామ్ సెప్తాం". హప్పుడ్ హాడూ హన్నాడ్, "హారె, మన్నూహివటానీకీ నీకీ యువర్రా. మన్నూనాద్. మాదీ మన్నూ, నీకీ హివ్వమ్. మీకీ దిక్కూవున్నా పోటెకి సెప్పుకోండీ" హన్నాడ్. హప్పుడ్ మాకీహంతా వాడి చోటు మీద ఫడినామ్, తుఫాకుల్ పేల్సినాడ్, బాంబుల్ కి యేసినాడ్ సస్సినోళ్ల మీదా బత్కినోళ్లూ హెక్కీ యుద్ధం సేశార్. ఘోడాసుట్టూ ఘోడా, ఘోడాసుట్టూ ఘోడా ఫదిఘోడలున్నయి.

2 వాలం: ఫదిగోడ లే ! యిప్పటికి యెన్నిదాటారు?

[ఒకసైడు వింగులోంచి ఒక వాలంటీరు వచ్చి సూర్యం వంక తదేక దీక్షతో చూస్తూ వుంటాడు.]

సూర్యం: హిప్పట్కి తొమ్మిది ఘోడల్ దాటినామ్. హింకా హొక్కి ఘోడావుంది. దాన్ని దాటాల, మీకీ వస్తార్, మీకీ వస్తార్? [అని ఒక్కొక్క వాలంటీరు దగ్గరకు పోయి అడుగుతూ, అప్పుడే స్టేజిమీదకు వచ్చిన వాలంటీరు దగ్గరకుకూడా పోయి] నీకీ వస్తావ్?

క్రొత్తవాలం: [రహస్యంగా] మీ అమ్మకు కులాసాగా లేదు. ఒక్కసారి వచ్చిపో! [బిగ్గరగా] ఎందుకు సాయిబూ, యీ పిచ్చికథలు నీకు?

సూర్యం: పిస్సీఖదల్. నీకి పిస్సీ [వాలంటీర్లతో] హారె, హివాల్టికి సాలు, రేపూ రండి, హింకో మంసీ, మంసీ, ఖధ హొక్టి సెప్తాన్.

[వాలంటీర్లు ఒకవైపు, సూర్యం యింకోవైపు నిష్క్రమణ]

[తెర]



# నా దేశం

## 11 వ రంగము

### సూర్యం యిల్లు

[శేషమ్మ మంచంమీద పడుకొని నిద్రపోతూ వుంటుంది. కొంచెం దూరంగా కమల ఒక చిరిచాపమీద పడుకొని వుంటుంది. మంచం దగ్గరగా ఒక మందుసీసా, సాసా, గంధంచెక్కా, వాసంకర్రా వుంటాయి. కమల, పడుకున్న చాపకు దగ్గిరగా మరచెంబు, దానిపైన గ్లాసూ వుంటాయి. ఒక పైఫున లాంతరు తగ్గించి వుంటుంది.]

శేషమ్మ: [బలవంతానలేచి] కమలమ్మా! [కమల పలకదు] అయ్యో యేంపొద్యమమ్మా, అప్పుడే నిద్ర పట్టిందీ కమలమ్మా. [కమల పలకదు] అవును లే. పగలల్లా పనిచేసె. పడుకోంగానె నిద్రపట్టింది కామల్ను [అని వాసంకర్ర పట్టుకొని లేవబోతుంది.]

కమల: [వాసంకర్ర చేసినమోతవిని] అయ్యో, మీరే లేస్తున్నా రేమిటి? యేంకావాలో చెప్పండి.

శేషమ్మ: ఏంలేదు. కాసిని మంచినీళ్లు తెచ్చిపెట్టమ్మా [కమల యిచ్చిన మంచినీరు తీసుకువచ్చి యిస్తుంది. మంచినీరు త్రాగి తిరిగిగ్లాసు కమలకిస్తూ] యింకా మాఅబ్బాయి రాలేదేమమ్మా?

కమల: వస్తాడు. తొందర పడితేయెలా? చాలా పొద్దు పోయిగానీ రాడు.

శేషమ్మ: ఏమోనమ్మా! యివ్వాళ మరీగుండెబరువుగావుంది.

చచ్చేముందుకాసిని తులసి నీళ్లుపోయిడానికైనావస్తాడో రాడో?

కమల: అబ్బా, ఏమిటా పాడుమాటలు, పడుకోండి.

శేషమ్మ: నాఖర్మం! చచ్చిశ్యామలమ్మతల్లీ దూరమయింది. బ్రతికుండి వీడూ కంటికి కరువైనాడు గదా!

కమల: యిదుగో! మీరిలా మాట్లాడితే నేనుకూడా యెక్కడి కైనా వెళ్ళిపోతాను.

శేషమ్మ: పోనితే అమ్మా!నీకంతకష్టంగావుంటే మాట్లాడను లే! మా యింటి యెత్తుధనంపోసినా నీలాంటి వరాలతల్లి దొరుకు తుందా అమ్మా! యేనాడో మేంచేసుకున్న పూర్వపుణ్యాం వల్ల నువ్వు మా యింట్లో అడుగు పెట్టావు కాని.

కమల: అబ్బా పడుకుందురూ [అని తను పడుకుంటుంది]

శేషమ్మ: సర్లె అమ్మా! నీమాట విన లేదని నిష్టూర్యం దేనికి? పడుకుంటాను లే. [అని పడుకుంటుంది]

[క్షణం నిశ్శబ్దం. తలుపు మెల్లిగా తట్టినశబ్దం, యిద్దరూ ఒక్కసారి ...చుంటారు.]

సూ: ఎవరది?

కమల: [...లోపలినుంచి] మాకీ తల్పు తీయండీ అమ్మా. యెవర్నిచూ...షంతో] మన సూర్యమే! [అని ఒక్క గంతున వెళ్ళి

పర్కిల్: ఏయ్..ఓ నూర్యం ముస్లిం డ్రెస్సుతో ప్రవేశం]

లేరు గాని ఒకమా నాయన యేడీ [ముస్లిం వేషంతోవున్న దగ్గరకు వెళ్లి] ఎవర్నివాయ్యా నువ్వెవరు నాయనా?

కమల: సూర్యం తల్లి... చ లేదటమ్మా?

శేషమ్మ: యిలా రా నాయనా...[శేషమ్మ సూర్యాన్ని పరీక్ష చేసి, గుర్తించినట్లు నటించి] అయ్యో, నాయనా, నువ్వేనా? ఎవరో సాయిబు అనుకున్నాను. ఈ వేషమేమిట్రా?

సూర్యం: పోలీసువాళ్లు పట్టుకుంటారని మారు వేషంలో తిరుగుతున్నానమ్మా.

శేషమ్మ: మా నాయన! ఎన్నాళ్లకి వచ్చావురా తండ్రీ! నీకోసం చూసీ, చూసీ కళ్లు కాయలు కాచిపోయినయి. ఈ బొందిలో ప్రాణం వుండగా "వస్తావో, రావో" అని తెగమధన పడ్డాను.

సూర్యం: అమ్మా! యెందుకమ్మా నీకంత దిగులు. నీ సంగతి రోజూ కనుక్కుంటూనే వున్నానమ్మా. మన యింటి చుట్టూ పోలీసువాళ్లు యిరవైనాలుగు గంటలూ కాపలా కాస్తున్నారు. అందుచేత రాలేకపోయానమ్మా.

నె

శేషమ్మ: పోనీ ఆ శ్యామలమ్మ పోతే, నువ్వయినా ఉంది.]
వసుకుంటే, నీ బ్రతుకు కూడా ఒడుదుడుకుల్లో
గదా! యీ ముసలి ప్రాణంకాస్తా గుటుక్కుమంటున్నా
కాసిని తులసి నీళ్లు పోయడానికైనా దగ్గర
వుండవో. [అని యేడుస్తుంది.] ప్పెట్టమ్మా

కమల: సూర్యం, ఏమిటిది? దీనివల్ల రోగం మంచినీళ్లు త్రాగి
రాలేదేమమ్మా?
ప్రయోజనమేమన్నా వుందా?

సూర్యం: అమ్మా! నువ్వు ఊరుకో. నాకాలా పొద్దు పోయి పర్వాలేదమ్మా. నువ్వు యెప్పుడు
అప్పుడు వస్తాను. ముందు మాట్లాడరీగుండెబరువుగావుంది.

[అని శేషమ్మను పడుకోమని బలవంతం చేస్తూవుండగా బయట నుంచి విసురుగా తలుపు కొట్టిన శబ్దం, ముగ్గురూ ఉలిక్కిపడతారు.]

కమల: సూర్యం! దొడ్డివేపున పారిపో!

[రెండో వైపునకూడా తలుపు కొట్టిన శబ్దం]

సూర్యం: అదుగో, యిటుకూడా తలుపు కొడుతున్నారు.

కమల: నువ్వు యెక్కడన్నా వెంటనే దాక్కోవాలి.

సూర్యం: ఎక్కడా?

కమల: [తొందర చేస్తూ] ఆ మంచం కింద దాక్కో. [సూర్యం హడావుడిగా మంచంకింద దాక్కుంటాడు] ఎవరు?

సర్కిల్: [లోపలనుంచి] మేమే. తలుపు తీయండి.

కమల: యేమిటాతొందర. వస్తున్నానుండండి.

[అని సైడ్‌వింగ్‌లోకి పోయి తలుపు తీసినట్లు నటించి మళ్లీ లోపలికి వస్తుంది. బయటనుంచి పిస్టల్‌తో సర్కిల్ యిన్స్‌పెక్టర్ ప్రవేశం]

సర్కిల్: సూర్యం యేడమ్మా?

కమల: నాకు తెలియదు.

సర్కిల్: పదినిమిషాలు ముందు ముస్లిం వేషం వేసుకొని మీ సూర్యం యింట్లో దూరడం మేం చూడలేదనుకున్నారా?

కమల: మా యింటికి యీ రాత్రి యెవరూ రాలేదు. మీరు యెవర్నిచూసి యెవరనుకున్నారో.

సర్కిల్: ఏయ్.టూ నాట్ ఫైవ్! వీళ్లు మనం చెపితే వినేటట్లు లేరు గాని ఒకసారి యిల్లంతా సోదాచూడు. [మంచం దగ్గరకు వెళ్లి] ఎవరమ్మా నువ్వు?

కమల: సూర్యం తల్లి.

సర్కిల్: మీ అబ్బాయి యేడమ్మా?

శేషమ్మ: నాకు తెలియదు నాయనా.

సర్కిల్: [కాలితో మంచంక్రింద తన్ని యెవరో వున్నట్టు తెలుసుకొని] ఏయ్.టూ నాట్ ఫైవ్, టూ నాట్ సెవెన్ యీ మంచం క్రింద యెవరో వున్నారు బైటికి తీయండి.

[పోలీసులు మంచం దగ్గరకు వెళ్తారు. కమల అడ్డంపోతుంది]

205 పో: అడ్డం లేవమ్మా [అని కమలను అవతలకు నెట్టేసి, ముందుకు వచ్చి మంచంమీదనుంచి జారుతున్నగుడ్డ లాగేస్తాడు. సూర్యం మంచంకింద నుంచి బయటకొస్తాడు.]

సర్కిల్: [బెల్టులోవున్న పిస్టల్ బయటకుతీస్తూ] సూర్యం! యూ ఆర్ అండర్ అరెస్టు! యేయ్.టూ నాట్ ఫైవ్! చూస్తావేం. చేతికి సంకెళ్ళు తగిలించు.

[205 పోలీసు సంకెళ్ళతో ముందుకు వస్తాడు.]

శేషమ్మ: [బలవంతాన లేచి సూర్యానికీ పోలీసుకూ మధ్య అడ్డంపోయి] మా నా కున్ని సంకెళ్ళేసి తీసుకు వెళ్తారూ. నా బొందిలో ప్రాణం వుండగా మీరావని చేయలేరు.

సర్కిల్: ఏమిటమ్మోయ్ ముసలమ్మా, మహా వాగుతున్నావ్. అడ్డం లేస్తావా, లేదా?

కమల: యిన్స్పెక్టరుగారూ, నే నావిడతో చెప్పి సమాధాన పరుస్తాను. మీరు వూరుకోండి.

సూర్యం: అమ్మా. నామాటవిని నువ్వు మాట్లాడకుండా వడుకో. మాతిప్పలు మేంపడతాం.

శేషమ్మ: నేపడుకోను. నాకన్న తల్లిని పొట్టన పెట్టుకున్నారు. చాలదూ! యింకా మీదాహం తీరలా?

సర్కిల్: యిదుగో ముసలమ్మా, మర్యాదగా చెవుతున్నాను, అడ్డంలే.

శేషమ్మ: నేను లేవను. యేంచేస్తారో చేసుకోండి.

సర్కిల్: [బాగా దగ్గరకువస్తూ] ఏమిటమ్మా, లెమ్మని చెప్తే ఊరికే సాగదీసుకుంటున్నావ్. యిప్పుడు నీదిక్కున్న వాడితో చెప్పుకో.

[అని చేయిపట్టుకొని శేషమ్మను విసురుతో అవతలకు లాగేస్తాడు. శేషమ్మ స్మారకం లేకుండా క్రిందకు పడిపోతుంది.]

సూర్యం: అమ్మా!

కమల: అయ్యో! అయ్యో! [అని శేషమ్మదగ్గరకు పరిగెత్తుతుంది.]

సూర్యం: [హఠాత్తుగా సర్కిల్ మీద పడి] ఓరి నీచుడా! యెంత పని చేశావురా! నువ్వు చేసిన దుష్కృత్యాలకు ఫలితం నేడే అనుభవిస్తావ్. పసి పిల్లలను, ముసలివాళ్లనూ నీ పొట్టన పెట్టుకోవడమేనా నీపని [కంఠాన్ని బాగా నొక్కి క్రిందకు నెడ్తూ] ఈరోజున నా చేతిలో నీ చావు తప్పదు. [యింకా బాగా నొక్కుతూ] చావు! చావు!

[కమలా, పోలీసులూ సూర్యాన్ని పోలీసుయిన్స్పెక్టరునుంచి విడదీయడానికి ప్రయత్నిస్తారు.]

కమల: సూర్యం! ఊరుకో. యేమిటది, నీకుకూడా మతి పోయిందేమిటి. ఊరుకో.

సూర్యం: [సర్కిల్ కంఠాన్ని యింకా బాగా నొక్కుతూ] చావు! చావు.

[సర్కిల్ కష్టంతో తన బెల్టునుంచి పిస్టల్ తీసి సూర్యం కడుపులో పెట్టి పేలుస్తాడు] అబ్బా! [అని సర్కిల్ మెడకున్న చేతి పట్టును వదుల్తాడు, సర్కిల్ తనపై నున్న సూర్యాన్ని ఒక నెట్టు నెట్టి నుంచొని డ్రస్సు దులుపుకుంటూ వుంటాడు. సూర్యం బాధపడుతూ ఒక చేత్తో డొక్క పట్టుకొని లేస్తూ వుండగా]

కమల: సూర్యం! సూర్యం! అయ్యో, యిన్‌స్పెక్టరుగారూ! వెంటనే డాక్టర్ని కబురు పంపండి.

సర్కిల్: అరె టూనాట్‌ఫైవ్! వెంటనే స్టేషన్‌కు వెళ్లి మన యంబ్యులెన్సు కారు తీసుకురా.

[205 పో. నిష్క్రమణ]

సూర్యం: [తల్లి దగ్గరకు దేకుతూంటూ వచ్చి]

అమ్మా! నువ్వుకూడా... నువ్వుకూడా... శ్యామల దగ్గరకు వెళ్లావా అమ్మా! నేను కూడా వస్తున్నానమ్మా. అమ్మా! నా కోసం, నీకు పిడికెడు అన్నమయినా పెట్టలేని, యీ నిర్భాగ్యుడికోసం, తండ్రి పోయిన నాటినుంచీ నీ జీవితాన్నంతా కష్ట పరంపరల పాలు చేసిన ఈ దౌర్భాగ్యుని కోసం, నీ ప్రాణాన్ని ధార పోశావా తల్లీ! నన్ను రక్షించడానికి పోలీసు యిన్‌స్పెక్టరుతో హోరాహోరీగా పోరాడిన నీ మాతృహృదయం క్షణంలో మంచుగడ్డయి పోయిందేమమ్మా! యీ ముసలి ప్రాణం కాస్తా గుటుక్కుమనే టప్పుడు "కాసిని తులసి నీళ్ళు పోయిడానికైనా వుంటావో, వుండవో!" అన్న నీకు నేను వుండికూడా తులసినీళ్ళు పోయలేకపోయాను.

అమ్మా! నీకోసం తులసి నీళ్లుగాదు. నారక్తాన్ని ధార
వోస్తానమ్మా!

సర్కిల్: ఎందుకయ్యా, నీకీ అనవసరపు ఘోష, శుభ్రంగా
మంచం మీద పడుకోబెడ్తాం, పడుకో.

సూర్యం: [యిన్స్పెక్టర్ దగ్గరకు దేక్కుంటూ వచ్చి] యిన్స్పెక్టరు
గారూ! మీ కాళ్లు బట్టుకు బతిమాల్తాను. భరతమాత
పుత్రుడవైన నీవు మన దేశమాత దాస్యవిముక్తి కోసం
పోరాడే స్వాతంత్ర వీరులను బంధించడం న్యాయమేనా?
మా అందరి హృదయాల్లో ప్రజ్వలించే స్వాతంత్ర పిపాస
నీలో లేదా! స్వతంత్రం నీకు మట్టుకు జన్మహక్కు
కాదా? "గాంధీ మహాత్మాకు జై!" "జవహర్‌లాల్
నెహ్రూకు జై" అంటే మీ హృదయం మాత్రం ఉప్పొంగదా?
బానిసలకన్నా నీచులై, పర ప్రభుత్వపు తొత్తులై
వుండవలసిన అవసరం మీకేం వచ్చింది! నామాట
వినండి. ఈ నీచ ఉద్యోగాలు వదిలిపెట్టండి! స్వాతంత్ర
పోరాటంలో మీరుకూడా చేరండి. యీ పర ప్రభుత్వపు
ఢిల్లీకోటను పగుల గొట్టండి!

[సర్కిల్ యిన్స్పెక్టరు యేమీ మాట్లాడకుండా అటూ యిటూ పచార్లు చేస్తూ వుంటాడు. సూర్యం యెక్కువ సేపు మాట్లాడినందువల్ల ఆయాసంతో ఒగరుస్తూ వుంటాడు.]

కమల: సూర్యం! ఎలావుంది, సూర్యం!

సూర్యం: కమలా! యెందుకు విచారిస్తావ్? మా జీవిత

నాటకంలోని కడపటి రంగం నేటితో సమాప్తి! కమలా! అన్నకూ, తండ్రికీ దూరమై, మాకెంతో సహాయం చేసిన నీకు స్మృతి చిహ్నంగా యివ్వడానికి నా దగ్గర యేమీ లేదు. చివరకు ప్రాణంకూడా యీ ప్రభుత్వమే తీసుకుంటోంది. యిక నీకు అర్పించవలసింది ఒకటే వుంది. అది నేనూ, నువ్వూ, మన తరువాత తరతరాలవాళ్లూ కూడా ప్రేమించి, తమ ప్రాణాలొడ్డి రక్షించవలసిన కన్నతల్లి! ఆమెను మాత్రం మరువకు. ఇదుగో! కమలా! యిది నా దేశం... నా ... దే ... శం!

[సూర్యం గిలగిలా కొట్టుకుంటూ ప్రాణాలు విడుస్తాడు]

[తెర వెనుకనుండి పాట]

జననీ! దేశమా
ప్రేమమయీ, దేశమా!
నీవూ, కుమిలిపోయెదే కడుపు మంటతో
నీ విముక్తికిక తరుణము రాదా
రత్నగర్భవగుదో, జననీ
రాలిన పుత్రుల, ప్రాణ సుమాలా
పూజలందు కొనుమా
ధన్యమైన జననీ!

[బాలకృష్ణ అనుమతితో]

[తెర]

[సమాప్తము]



# ఆశీస్సు

"కళ సూక్ష్మభావాలతో ప్రజలను ఉత్తేజింప చేయాలి. అప్పుడే వారు వ్యక్తిత్వము, దేశగౌరవము నిల్పుకొనుటకు శక్తివంతులగుదురు. ప్రజానీకంలో ప్రచారానికి మించిన కళలేదు. "జాతీయ కళామందిర్" వారి కృషిని నేను అభినందిస్తున్నాను."

-అరుణ అసఫాలీ.

---

# అభిప్రాయాలు

"నాటకంలో గుండెలు కదల్చే విషాదఘట్టాలున్నాయి. కొన్ని దృశ్యాలలో రచయిత మహోత్కృష్టమైన కళాసీమలకు నడచాడు. ఈనాటకం ఆంధ్రప్రజలఆగష్టుజీవితాన్ని ప్రతిబింబింపజేసే ఉత్తమకళాఖండం"

"జన్మభూమి"

"ఆగష్టు ఉద్యమ కాలంలో ప్రజల మనోభావముల వివిధ పరిణితులను రచయిత చక్కగా చిత్రించాడు. భావం, రచన, ప్రదర్శన చక్కగా వున్నయి. జాతీయ భావములను ప్రజలలో ప్రచారం చేయుటకు యిట్టి నాటకములు అవసరం."

"ఆంధ్రప్రభ"

"బాపట్ల జాతీయకళా మండిర్ వారు 'నాదేశం' అనే నాటకాన్ని చక్కగా ప్రదర్శించారు. 1942 ఆగష్టు విప్లవోద్యమంలోని ఒక వీరుని గాథను రూపకంగా సృష్టించి అమరత్వము సిద్ధింపజేశారు. హృదయాన్ని కదిలించి, రాజకీయ చైతన్యం కలిగించి, ప్రజానీకంలో సంచలనం కలిగించే, ఉత్తమనాటకంయిది. ఈ సంస్థ యింకా యిటువంటి జాతీయ నాటకాల్ని ప్రదర్శించుగాక యని కోరుచున్నాము."

"రూపవాణి"

---

# జాతీయ కళామందిర్

## కార్యవర్గము



1. వడ్లమూడి సీతారామరావు L.L.B.
2. పోతుకూచి ఈశ్వరచంద్రవిద్యాసాగర్.
3. అవటపల్లి శ్రీనివాసరావు.
4. గూడూరు అంకమ్మచౌదరి.
5. కొమరవోలు బాలకృష్ణరాజశర్మ LL.B.
6. మోదడుగు హనుమంతరావు
7. బెండపూడి యస్. యెన్. భరద్వాజ్.
8. కొమరవోలు శీతారామరావు. L.M.P. (HoM)
9. మంత్రివాది సూర్యనారాయణ.
10. జల్దు వెంకటేశ్వర్లుగుప్త.
11. పులిపాక రామచంద్రశాస్త్రి. B.A., B.L.

# "నా దేశం" లోని నటవర్గం

| | |
|---|---|
| సూర్యం : | రామచంద్రికాశ్యప |
| రాధా మోహన్ : | సీతారామారావు |
| శివం : | రామమోహన్ |
| భానుమూర్తి : | గంగాధర్ |
| జాతీయవాది : | విద్యాసాగర్ |
| అప్పడు : | బాలకృష్ణ |
| సర్కిల్ : | భరద్వాజ్ |
| శ్యామల : | కుమారి కళ్యాణి అండ్ వసుంధర |
| కమల : | శ్రీమతి మల్లికాంబ |
| శేషమ్మ : | సుబ్బారావు |
| మ్యూజిక్ : | విద్యాసాగర్ |
| ఆర్కెస్ట్రా : | వీరబ్రహ్మాచారి & పార్టీ |
| ఆర్టు & లైటింగు : | గంగాధర్, భరద్వాజ్, బాలకృష్ణ. |
| స్టేజి కండక్షన్ : | మిస్టర్ మూర్తి |

విభాగం:

అవటపల్లి శ్రీనివాసరావు

బాపట్ల.

త్వరలో:

జాతీయ కళామందిర్ వారి

"రామ రాజ్యం"

Printed by I. V. Ratnam, M. Sc., at A. G. Press, Bezwada &
Published by Kalapeetham, P. I. C. E 37, 14-8-47.